శ్రీ ర స్తు.

# శు క స ప్త తి

కదిరిరాజ్యప్రభువగు

పాలవేకరి కదిరీపతినాయకప్రణీతము



(క్రొత్తకూర్పు.)



చెన్నపురి :

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

# ప్రకాశకవిజ్ఞప్తి

తెనుఁగు కావ్యములలో జాతీయజీవితమును ప్రతిబింబింపఁ జేయుచు, శృంగారరసోల్లసితములగు కథలతో, జాతీయము లతో, సరసకవితాధోరణితో రచితమైన "శుకసప్తతిని" మేము చక్కగ క్రీ॥ శ॰ 1935లో ముద్రించితిమి. అది అంతకుముందు 'సరస్వతి' పత్రికలో వెలువడిన ముద్రితప్రతికన్న అవతారికాది విశేషములఁ గలిగియున్నది. కాని కథలుమాత్రము విశేష ముగ లభింపలేదు. ఈనడుమనే మా ముద్రితప్రతులన్నియుఁ జెల్లిపోవుటచేత దీని ముద్రణము ఇపుడు చేయవలసిన యావ శ్యకమేర్పడినది. ఆంధ్రసారస్వతవిమర్శకులలోఁ బ్రసిద్ధులు శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారి గ్రంథముద్రణమునకు మమ్ము మిక్కిలిగాఁ బ్రోత్సహించి, ఉపోద్ఘాత వివరణములువ్రాసి యిచ్చిరి.

ఇంతవఱకు ముద్రిత శుకసప్తతిలో చేరని పెక్కుకథలను ప్రొ॥ త్తవానిని శ్రీ నిడుదవోలు శివసుందరేశ్వరరావుగారు మాకు వ్రాసియిచ్చి ఈ గ్రంథసమగ్రస్వరూపమునకు తోడ్ప డిరి. ఇప్పుడీగ్రంథములలో నున్నవిశేషకథ లీవఱకెక్కడను తెలియరాలేదని చెప్పవచ్చును. మఱియు నీ కవి కాలనిర్ణయ మును చక్కగా మొదట నిర్ణయించిన శ్రీ నిడుదవోలు వేంకట

రావుగారు, తాము ప్రకటించిన "కదిరీపతికాలము" అను వ్యాసము నిందులో చేర్చుట కనుమతి యొసంగిరి. విపులమగు నుపోద్ఘాతమేగాక విశేషపదములపట్టిక అర్థసహితముగ నిందుండుటచే నీ ముద్రణము ఆంధ్రమహాజనుల నాకర్షించునని నమ్ముచున్నాము. ఈ గ్రంథప్రకటనమున మాకుఁదోడ్పడిన పై వారలకందఱకు మాకృతజ్ఞత నిందుమూలముగఁ దెలుపుచున్నాము.

ఇట్లు,

వావిళ్ల వేంకటేశ్వరులు.

# పీఠిక

## పాలవేకరి కదిరీపతికాలము

జాతివార్తారచనాచమత్కారవిలసితమును సరసకవితా మనోహరమును నగు శుకసప్తతి యనుప్రశస్తప్రబంధమును రచియించిన కదిరీపతి చంద్రవంశక్షత్త్రియుఁడు. అచ్యుతగోత్త్రుఁడు. అనంతపురమండలమునఁగల కదిరి లేక ఖాద్రి రాజ్యమునకు నధినేత. ఖాద్రియందు శ్రీ నరసింహస్వామి యీతని యిష్టదైవము. ఈతని వంశీయులలోఁ గూటస్థుఁడు 'తాడిగోళ్ల' అను గ్రామమున నివసించుటచే, నీతని తాతవఱకును గలనామముల ముందు 'తాడిగోళ్ళ' అనుపేరు వెలయుచుండెడిది. శుకసప్తతి గద్యనుఁ జూచిన నీవిషయము తెల్లమగును.

"ఇది శ్రీ మత్ఖాదిరీనృసింహకరుణాకటాక్షవీక్షణసమాగతకవితాధార పాలవేకరికులకలశాంభోధిసుధాకర తాడిగోళ్ళ కరియమాణిక్యనృపహర్యక్షపౌత్త్ర పవిత్రచరిత్ర కదురధరామండలాఖండలపుత్త్ర విద్వత్కవిరక్షణానుసంధాయక కదిరీపతి నాయక ప్రణీతంబైన శుకసప్తతి యను మహాప్రబంధమునఁ బ్రథమాశ్వాసము."

కదిరీపతి * శుకసప్తతి కృత్యాదిని తన వంశక్రమము నిట్లు తెలిపియున్నాఁడు:—

---

* శుకసప్తతి తొలుత కాకినాడ, బాలసరస్వతీముద్రాలయమున క్రీ. శ. 1909 సంవత్సరమున ముద్రితమైనది. ఆకాలమున వెలువడిన




సుప్రసిద్ధపత్రికలలో నెన్నఁదగిన 'శ్రీసరస్వతి' పత్రిక యందు ప్రకటితమైనది. అందు కృత్యాదిపద్యములను నాంధ్రసాహిత్యపరిషత్తువారు క్రీ. శ. 1929 లో శుక్ల-చైత్ర వైశాఖ పరిషత్పత్రికలోఁ బ్రకటించినారు. కృత్యాదిపద్యములఁ బరిషత్తు ప్రకటింపకున్నచో నీరాజకవి చరిత్రము మన కీపాటియైన తెలియదు. కీర్తి శేషులు వీరేశలింగము పంతుల వారి కవిచరిత్ర రచనాకాలమున కివి యలభ్యము లగుటచే వారీ కవికాలనిర్ణయము చేయుట కనువుపడ లేదని వ్రాయుట తటస్థించినది. కృత్యాదిపద్యములతోఁ గూడ నిప్పటి కాఱేండ్లక్రిందట ననఁగా క్రీ. శ. 1935 సంవత్సరమున "వావిళ్ల" వారి శ్రీరామముద్రాలయమున నీగ్రంథ మభిరామముగ ముద్రితమైనది.

తనవంశమునకుఁ బాలవేకరి యను పేరువచ్చుటకుఁ గారణము గదిరిపతి యిట్లు చెప్పియున్నాఁడు.

" ఆ రసికావతంసకుల మాత్మసముద్భవహేతుభూతమై
ధీరతపాలవెల్లి జగతిం దగెఁ దన్మహిమం బపారగం
భీరఘనాఘసంభరణ భీమబలప్రతిభాప్తి గాంతు సం
చారయఁ బాలవేకరి కులాఖ్య వహించె నుదంచితోన్నతిన్.
ఆమహితాన్వవాయ వసుధాధిపు లచ్యుతగోత్రపాత్రులు
ద్దామభుజాపరాక్రమవిదారిత ఘోరమదారివీరులై
భూమిభరించి రాన్నృపుల భూతి మహోన్నతి నేలె భోగసు
త్రాముఁడు తాడిగోళ్ళ పురధాముఁడు శ్రీపెదయాబళుం డిలన్.

పై పద్యమున వర్ణింపఁబడిన పెదయాబళుఁడు తాళికోట యుద్ధమున క్రీ. శ. 1565లో మరణించిన యళియరామరాజు కాలమున నున్న ట్లీ క్రింది సీసపద్యపాదమువలనఁ దెలియుచున్నది.

" అళె రామరాజేంద్రు బలవద్రిపుల ద్రుంచు కలని కేధీరుండు కర్తయయ్యె" కావున నీతఁడు. క్రీ. శ. 1560 ప్రాంతమువాఁ డని చెప్పనొప్పును.

ఈతఁడు మహావీరుఁ డగుటయేగాక మహాభక్తుఁడై శ్రీశైలాద్రి నరసింహునకు భోగమండపాదులు గట్టించి ప్రఖ్యాతిఁ గాంచెను.

ఆవెనుక నీతని వంశమునఁ బ్రసిద్ధిచెందినవాఁడు కదిరిపతి నాయకుని తాత కరెమాణిక్యరాజు. ఈతఁడు రామరాయల సరిగద్దియ నొడ్డోలగమున నుండి, రామనామధ్యాననిష్ఠాగరి

ష్టుఁడై, రామరాయక్షమావరదత్త బిరుదాంకితరాజచిహ్ని
తుఁడై ప్రకాశించెను. ఈ రామదేవరాయలు క్రీ. శ. 1534-
1614 వఱకును విజయనగరసామ్రాజ్యమును సమర్థతతో నేలిన
వీరవేంకటపతిరాయల వెనుక రాజ్యమునకు వచ్చి క్రీ. శ.
1630 వఱకును పాలించెను. కావున నీ కదిరీపతి తాత యగు
కరెమాణిక్యనృపాలుఁడు క్రీ. శ. 1620 ప్రాంతమువాఁడు.

తాతవెనుక కదిరీపతి, పెద్దతండ్రి రామభూపతి 'శ్రీరంగ
రాయ దత్త మత్స్య మకరధ్వజాఢ్యుఁడు' అని పొగడ్తకెక్కిన
వాఁడు. ఈ శ్రీరంగరాయలు విజయనగర సామ్రాజ్యాధీశులలోఁ
గడపటివాఁడని చెప్పఁదగును. ఈతఁడు క్రీ. శ. 1642 సంవత్స
రమున సింహాసనము నధిష్ఠించి యిరువదిమూఁడేండ్లు పరిపా
లించెను. ఈతని కాలమున ననఁగా క్రీ. శ. 1665 సంవత్సరమున
మహమ్మదీయు లీ రాజ్యము నాక్రమించుకొనిరి. కావున కదిరీ
పతి పెదతండ్రి క్రీ. శ. 1650 ప్రాంతమువాఁడగుట స్పష్టమే.

రామభూపతి తమ్ముని కొమారుఁడగు కదిరీపతియు
క్రీ. శ. 1660 ప్రాంతమున నుండుట నిర్వివాదముగా నేర్పడు
చున్నది. మఱియు నీతఁడు శుకసప్తతియందు మొదటి కథలో
నాంగ్లేయుల నిట్లు పేర్కొనినాఁడు.

చ. "వలసిన చీరముల్ తెలియవచ్చినవారును వాదు గల్గువా
రలు మఱి గుత్త గొల్లలును రత్నపరీక్షలవారుఁ గార్యముల్
గలిగిన యింగిలీసుల ముఖాములఁ జెంగట నుల్లసిల్లఁగాఁ
గొలువున నుండుఁ జూపరులకున్ గనుపండువు సంఘటిల్లఁగాన్. (1-86)

ఇంగ్లీషువారు క్రీ. శ. 1639 సంవత్సరమున మదరాసున
తొలుత వర్తకస్థాన మేర్పఱచుకొనిరి. వారు రాజ్యముకొఱకుఁ

గాక కేవల వర్తకవ్యాపారనిమగ్నులుగా నుండు కాలముననే యారంభదశలో శుకసప్తతిరచనము జరిగినట్లు పై పద్యము చెప్పుచున్నది. ఈవిషయమును పై కాలమునే స్థిరపఱచుచున్నది. కావున కదిరీపతికాలము పదునాఱవశతాబ్దమున నుత్తరార్ధ మని చెప్పఁదగును.

'శుకసప్తతి' యను పేరు సార్థకముగా నిందు డెబ్బదికథ లుండవలసినది. కాని ప్రస్తుతము లభించిన శుకసప్తతియందు ముప్పదికథలు మాత్రమే గలవు. ఈకథలలో పెద్దకథలును నుప కథలును గలవు. శుకసప్తతిలో నేఁడు పెద్దకథ లిరువదియొకటియు చిన్నకథలు తొమ్మిదియుఁ గలవు. ఉపలబ్ధము లగు తాళపత్ర పుస్తకములయందును నేఁడు ముద్రితమైన నాలుగవ యాశ్వా సమునఁ గొంతభాగమువఱకును గన్పట్టుచున్నవి. ఇప్పటికి నూఱేండ్ల క్రిందటఁగూడ శుకసప్తతియందు ముప్పదికథలు మాత్రమే లభించినట్లును నీగ్రంథమునకు 'శుకత్రింశతి' అనుట సమంజసమనియు బ్రౌనుదొరవారు శుకసప్తతిగ్రంథమునకుఁ దాము దయారుచేయించిన శుద్ధలిఖితప్రతియందు వ్రాయించి యున్నారు. ఈ వ్రాఁతప్రతి క్రీ. శ. 1831లో సంపుటీకరణము చేయఁబడి నేఁడు ప్రాచ్యలిఖితపుస్తకాగారమున నున్నది.

సంస్కృతమున శుకసప్తతి యను గ్రంథము కలదు—అది యముద్రితము—ఈ గ్రంథము తెలుఁగుగ్రంథమునకు కేవలమూలముగాదు. సంస్కృతమున కిది యనుకరణముగాని భాషాంతరీకరణము గాదని బ్రౌనుదొరవారి యభిప్రాయము.

కదిరీపతినాయకునకు నూఱేండ్లతరువాత నయ్యలరాజు నారాయణామాత్యుఁ డను కవి 'హంసవింశతి, యను ప్రబం

ధము రచియించియున్నాఁడు. శుకసప్తతికిని హంసవింశతికిని కథారచనమునను గద్యపద్యములయందును పెక్కు పోలిక లగపడుచున్నవి—నారాయణామాత్యుఁడు కదిరీపతినాయకు నకుఁ దరువాతివాఁ డగుటచే శుకసప్తతి వరవడిగా, కొన్ని విశేషములఁ జేర్చి హంసవింశతిరచనము గావించెను. ఈ రెం డింటిని సమగ్రముగాఁ బరిశీలింపవలసియున్నది.

విద్యారత్న :

నిడదవోలు వేంకటరావు, M. A.

# ఉపోద్ఘాతము

## కవి కాలము

శృంగారకథలను శుకసప్తతియనుపేరుతో, మనోహరమగు సుందరశైలితో, ఆహ్లాదకరమగు వర్ణనలతో, అడుగడుగునకు నవ్వించు సన్నివేశములతో, రచించిన యసాధారణ కవియగు కదిరీపతినిగురించికాని యాతనిగ్రంథమునుగురించి కాని నేఁటివఱకు మనకుసమగ్రముగాఁదెలియకుండుటయత్యంత విచారకరము. ఇంచుమించు 300 ఏండ్లక్రిందటిగ్రంథమే మనకు పూర్తిగా లభింపకపోవుట మన దురదృష్ట మనవలెను. ౧౯౦౯ లో మొదటిసారి దొరికినంతవఱకు ముద్రించినప్పుడు కృత్యాదిపద్యము లేవియు లభించియుండలేదు. అట్టిసందర్భమందు ౧౯౩౧ లో నేను, మద్రాసులో ఇప్పటిప్రధానన్యాయమూర్తులును, అప్పటి ఎఫ్. ఎల్, విద్యార్థులునగు శ్రీపీ. వీ. రాజమన్నారుగారిసంపాదకత్వమున వెలువడు "కళ" యను మాసపత్రికలో శుకసప్తతిని గురించి వ్యాసము వ్రాసినప్పుడు అందలి కొన్నివర్ణనలనుబట్టి యీగ్రంథము క్రీ. శ. ౧౬౦౦-౧౬౫౦ ప్రాంతమందు రచింపబడినదని వ్రాసియుంటిని. గ్రంథములో పరంగివారు, ఇంగిలీసులు, వారి "ముఖాములు" మున్నగునవి పేర్కొనబడినందున ఇంగ్లీషువారు క్రీ. శ. ౧౬౦౦ నుండియే మనదేశమున వ్యాపార మారంభించియుండినందున కవికాలము నావిధముగా నిర్ణయించియుంటిని. తర్వాత

వావిళ్ల వారిముద్రణము ౧౯౩౫ లో వచ్చెను. అందు వారు కృత్యాద్యవతారికాపద్యములను ముద్రించిరి. వాటిని చదివినతర్వాత నేను కళలో నిర్ణయించినకాలమందు మార్పేమియు నవసరము కాలేదు. నా మొదటినిర్ణయమే స్థిరపడినది. ఇతనివంశము వారందరును విజయనగరసామ్రాజ్యముతో శ్రీకృష్ణదేవరాయల కాలమునుండియు సంబంధముకలవారై సేనల కధిపతులై చక్రవర్తులచే బిరుదులందినవారై యుండిరి. పెదయోబళరాజు "సముగ్రమహాహవోగ్ర సప్తతి సహస్రచాపభృత్ సైన్యజిత మదాహితేంద్రుండు." ఇది అతిశయోక్తియో లేక సహజోక్తియో తెలియదు. కరె మాణిక్యరాజు "రామరాయ క్షమావరదత్త బిరుదాంకుఁడు." రామరాజు "శ్రీరంగరాయ దత్తమత్స్యమకరధ్వజాఢ్యుఁడు." మఱి శుకసప్తతికర్తయగు కదిరీపతి కేవల మాకులపై గంటము త్రిప్పినవాఁడుకాఁడు. అహితులపై కఠారినికూడ ప్రశంసాపాత్రముగాఁ ద్రిప్పినట్టివాఁడు.

ఈకవికుల మెట్టిదో స్పష్టముకాలేదు. ఇతడు చంద్రవంశపుక్షత్రియుఁడైనట్లు తానే తెలుపుకొన్నాఁడు. రాజపదాంతనామములగుటచేత "రాచవారు" అనుకులమువారై యుందురు. వీరు అళియరామరాజు లేక శ్రీరంగరాయల వంశమువారైనట్లు తెలుపుకొనలేదు. ఆరాజులవద్ద సేనానులుగా నుండినట్లుమాత్రమే తెలుపుకొన్నారు.

## అంకుబొంకులముచ్చట

మనదురదృష్టముచేత శుకసప్తతి పూర్తిప్రతి యింతవఱకు దొరకియుండలేదు. ఆంధ్రభాషోద్ధారకులగు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారికృషి ఫలితముగా నిప్పు డించుమించు

సమగ్రముగా శుకసప్తతి లభించినదనవచ్చును. అందుకు శ్రీ శాస్త్రిగారికి ఆంధ్రలోకము కృతజ్ఞతాబద్ధమైనది. ఇదివరలో ముద్రితమైన ప్రతిలో ఉపకథలతోసయితము మొత్తము ౩౧ కథలుకలవు. వీటికి ౪౫ రాత్రులుపట్టినట్లు లెక్కించిన తెలియవచ్చెడి. ఎటుచూచినను ౭౦ సంఖ్య పూర్తికాలేదు. నాల్గవయాశ్వాసములో ౧౨౭ పద్యములే లభించియుండెను. ఇప్పుడు నాల్గవయాశ్వాసము ఇంచుమించు పూర్తిగా లభించినది. ౭౦ రాత్రులవఱకు కథ పెరిగినది. దీనినిఁబట్టి సప్తతియనిన ౭౦ కథలు కాదనియు ౭౦ రాత్రులని స్పష్టమైనది.

ఈశుకసప్తతికథలు అంకుపోయి బొంకాడినకథలనియు, అందుచేత స్త్రీలు బాలురు, శిష్టులు, చదువరానట్టివనియు, ఇట్టి పచ్చిశృంగారము గర్హ్యమనియు తెనుఁగుసాహిత్యచరిత్రకారులు, విమర్శకులు, ఆక్షేపించుచువచ్చినారు. ఇది విచారకరము. ఈకథలలో ౧ వ, ౪వ, ౧౧వ, ౧౫వ, ౨౦ వ కథలో మొదటి యుపకథ, అయిదవ యుపకథ, ఆఱవ యుపకథ, మొత్త మేడుకథలు అంకుబొంకులులేనివై శిష్టులు చదువదగినవై యున్నవి. అట్టివారికొఱకు వీటిని కృత్యాదిపద్యములతోఁ జేర్చి వేరుగా శిష్టప్రతి నొకదానిని ముద్రింపవచ్చును. తక్కినకథలలో అంకుముచ్చట్లున్నను కవి యెచ్చటను నసహ్యమగునట్టి, లేక జుగుప్సాకరమగునట్టి, వర్ణనలను జేయలేదు. శ్రీనాథుని శృంగారనైషధములో, హరవిలాసములో, సారంగతమ్మయవైజయంతీవిలాసములో, క్రీడాభిరామములో, కూచిమంచి తిమ్మకవికృతులలో, బహుప్రబంధకవుల సంభోగవర్ణనలలో నుండిన పచ్చి శృంగార మిందు లేనేలేదు.

అంకుబొంకు, పచ్చిపిచ్చిశృంగారము, నీతిబాహ్యత మున్నగుపదాలకుఁ గవితలో నెంతవఱకు హద్దుపద్దు లుండ వచ్చును? అనువిషయమునుగురించి బహుప్రాంతములలో చర్చలు జరిగినవి. మన తెనుఁగునందుమాత్రమే యిట్టివి కలవని తలపరాదు. సంస్కృతములో బహుగ్రంథము లిట్టివి కలవు. అచ్చ తెనుఁగులో నేది బూతగునో దానిని సంస్కృతములో స్పష్టముగా నుచ్చరించుట బహుపండితులకుఁ బరిపాటి. మరుఁగు మాటలకు సంస్కృతము సహాయపడుచున్న దన్న మాట. శిష్యుల కేవగింపు గలిగించు కవితలను మహాకవులు కొందఱు ప్రతిభాషలో కొంతయైనను వ్రాసిరి. ఇతర దేశములందును జనులనీతికి భంగముకలిగించునని కొన్ని గ్రంథములను నణచి వేసిరి. కాని తత్ఫలితముగా వానికి ప్రచార మెక్కువై యవి మఱింత వ్యాప్తిలోనికివచ్చెను.ఇటలీ దేశములో 'బొకాషియో' అను నతడు క్రీ. శ. ౧౩౫౩ లో అనగా ౬౦౦ ఏండ్లకు పూర్వము 'డెకామరన్' (దశదివసకథలు)అను పదిదినాలకథలను నూఱింటిని రచించెను. అవన్నియు శృంగారకథలే. ఈ ౬౦౦ ఏండ్లలో ప్రపంచములోని ప్రసిద్ధరచనలు ఆ 'డెకామరన్'నుండి ఏర్పడినట్టివి. ౧౯౨౨ లో అమెరికాలోని న్యూయార్కులో అవినీతివిధ్వంసకసంఘ మొకటి 'డెకామరన్' పుస్తకాన్ని నిషేధించుటకై కృషిచేసెను. అప్పుడు న్యూయార్కునగర న్యాయమూర్తియగు ఓబ్రిన్ (O'Brien) ఇట్లు తీర్పుచెప్పెను. "ప్రపంచవిఖ్యాతిగన్న సాహిత్యము (classics)ను ఖండించుట సాధ్యముకాదు. షేక్స్పియర్, చాజర్, లారెన్సుస్టరన్,

ఇంకా యితర ప్రసిద్ధాంగ్లరచయితలు కూడా నిషేధింపదగినవా రగుదురు. అన్నియు నట్లుండ బైబిల్‌లోని పూర్వభాగములో (old testament) కావలసినన్ని బూతులున్నవి. అది ఇంటింట నుండు గ్రంథము" ఇంగ్లండులో అమెరికాకవియగు వాల్టు విట్మన్ కవితను ఫ్రెంచిరచయితయగు ఎమిలిజోలారచనలను (ముఖ్యముగా 'నానా'యను నవలను) ఫ్లోబర్ట్ యొక్క మేడంబవరీ నవలను నిషేధింపఁజూచిరి. ఇప్పుడిప్పుడు అమెరికాలోని హార్వర్డు, కొలంబియా విద్యాపీఠాలలోను, కొన్ని కాలేజీలలోను, సాహిత్యవిజ్ఞానార్థమై 'డెకామరన్' పుస్తకాన్ని పాఠ్యగ్రంథ ముగా నిర్ణయించుచున్నారు. ఇట్టి డెకామరన్‌లోని ఒకకథను పూర్తిగా పోలినట్టికథ శుకసప్తతిలో కలదు. డెకామరన్‌లో ఏడవ దినమందలి నాల్గవకథతో శుకసప్తతిలోని ఎనిమిదవకథ సరిపోలినది. డెకామరన్‌లో ఏడవదివసపు పదికథలన్నియు కాముకులు చిక్కులలో నిరికి సమయస్ఫూర్తిచేఁ దప్పించు కొన్నశృంగారకథలు. అట్టి విధానముకలవే శుకసప్తతిలోని అత్యధికకథలు. శుకసప్తతికథలు అంతుపోయి బొంకాడినకథలని ప్రచారము మొదలైనతర్వాత అందఱును అదే ధోరణిలో పడిరి. ఈ గ్రంథమునుకాని, ఇందలి కొన్నికథలనుగాని పాఠ్య గ్రంథాలలోని సంకలనములలో చేర్చరైరి. పిల్లలమఱ్ఱి పిన వీరన, అయ్యలరాజు రామభద్రుఁడు, కూచిమంచి తిమ్మకవి, కంకంటి పాపరాజు, కుమ్మరి మొల్ల, గట్టుప్రభువు, సంకుసాల రుద్రకవి, మున్నగువారి కిచ్చినస్థానమైనను కదిరీపతి కియ్య లేదు. యథార్థముగా ఉత్తమకవులశ్రేణిలో కదిరీపతి చేరునట్టివాఁడు.

## శుకసప్తతికథలకు మూలము

తెనుఁగులో శుకసప్తతికథలు అను నొకవచనగ్రంథ మున్నది. దానినుండి కదిరీపతికవిత యేర్పడినదనికాని, కదిరీపతి కవిత కది వచనమనికాని చెప్పుటకు వీలులేదు. బహుశః అది యిటీవల రచింపఁబడినదై యుండును. పద్యకావ్యమునకు వచన గ్రంథమునకు చాల వ్యత్యాసమున్నది. సంస్కృతములో నొకశుకసప్తతికలదని మాత్ర మెరుఁగుదును. కాని దానిని చూడలేదు. దానిని చూచినపండితులు దానిపై నభిప్రాయ మీయవచ్చును. కథాసరిత్సాగరము ప్రపంచకథలకు మూల ఖని. దానినుండి కొన్ని శుకసప్తతికథ లేర్పడినవి. కథా సరిత్సాగరము (క. స.) లోని లంబకము ౨ తరంగము ౪ లోని లోహజంఘునికథ శుకసప్తతిలోని ౧౭ వ కథను బోలి నది. క. స లోని లం-౨. త-౫ లోని పరివ్రాజికా కథ శు. స. లోని యాఱవకథను బోలినది. క. స. లోని లం-౨. త ౫ లోని శుక్తిమతికథ శు. స. లోని ౧౪ వ కథతో సరి పోలును. ఈవిధముగా గొన్నికథలు కథాసరిత్సాగర మూల కములు. శుకసప్తతిలో విక్రమార్కునికి సంబంధించిన ౧౦ కథలు కలవు. అవి విక్రమార్కునిపేర ప్రచారమందుండు కథలనుండి గ్రహించియుండును 'డెకామరన్'లోని యొకకథ శుకసప్తతిలోని యొకకథను బోలిన దంటిని. దీనినిబట్టి యిట్టికథలు మనదేశము నుండి యూరోపుఖండములో నెంతోదూరమందుండు దేశము లందును వ్యాపించెనని తెలియవచ్చెడి. సంస్కృతశుకసప్తతి నుండి క్రీ. శ. ౧౪ వ శతాబ్దినుండి ఫార్సీలోనికి "తూతీ" కథలు అనుపేరుతో తర్జుమా యయ్యెనందురు. దాని

నుండి యూరోపుభాషలలోని కీకథ లనువదింపఁబడెను. ఒక యూరోపియన్ భాషలో నీకథలు (Tristan un Isolde) అను పేరుతో ననువదింపఁబడెనట! ఈవిషయమునుబట్టి క్రీ. శ. ౧౩౦౦ కు పూర్వమే మనదేశమందు సంస్కృతములో శుకసప్తతియుండెనని 'డెకామరన్' కథలకన్న ముందే మనకథలు వ్యాప్తిలోనుండెననియు, బహుశఃసంస్కృతమూలమునుండియే కదిరీపతి కథావస్తువును మాత్రము గ్రహింపవలెననియుఁ జెప్ప వచ్చును. కాని కథలలోని పాత్రధారులందును తెనుఁగువారే. వారును కదిరీపతికాలమువారే! ఈవిధానమును కవి యవలంబించి మనకు మహోపకారమొనర్చినాఁడు.'డెకామరన్' తర్వాత ఫ్రాన్సులో 'హెప్టామరన్' అను శృంగారకథలు పుట్టెను. అవి కూడ యిట్టికథలే. ఆ'హెప్టామరన్'కుకూడ 'డెకామరన్'వలె అధిక వ్యాప్తి కలిగెను. ఈవిధముగా పైకథలన్నియు శుకసప్తతికథల సబ్రహ్మచారులని యెఱుఁగవలెను.

శుకసప్తతిలోనివిశిష్టతలు

౧. శైలి:— శుకసప్తతిశైలి యందఱికిని యర్థమగునట్టిది. నిఘంట్వాపేక్ష కలిగింపనట్టిది. అతిసరళము. అతిమధురము. కథ రమ్యముగా నడిపించుట కెట్టిభాషవాడవలెనో యట్టిదే వాడినాఁడు. మనము వచనములోసయిత మంతధారాళముగా వ్రాయఁజాలము. తెనుఁగులో ప్రబంధయుగమందు వ్రాసినకవితలన్నియు కఠినమగుశైలిలోను, ఉత్ప్రేక్షాతిశయోక్తులతోను, శబ్దాలంకారములతోను, ద్వ్యర్థులతోను, ఒకేవిధమగు నొకే సమయములతోను నిండినదై, ఆనందము నిచ్చుటకుమారుగాఁ గ్లేశము నిచ్చునట్టిదై యుండెను. ప్రబంధములకథలుకూడ కవి

*

యొకధోరణిలోనివి. ఒకయూరను ఒకరాజు ఏలెను. అతఁడు వేటకుఁబోయెను.ఒకకన్యకను చూచెను.ఉభయులకువిరహతాప మయ్యెను. శైత్యోపచారములు జరిగెను. చచ్చునంతపనియై యొటులో యుభయులకు సమాగమమయ్యెను. వారి పెండ్లియు నిషేకమును నయ్యెను. ఇది కథ. మధమధ్య నష్టాదశవర్ణనలు నింపుట. స్త్రీవర్ణన యొకేమాదిరిగా నుండుట. ఇదంతయు కవుల భావదౌర్బల్యమును, క్షీణదశను తెలుపునట్టిది. ఒకదిక్కున అప్పకవి యపూర్వనిబంధనలు చేయుచుండ నదేకాలమందు మరొక దిక్కు కదిరీపతి యానిబంధనలను తృణీకరించి స్వతంత్రుఁడై కబ్బమును రచించెను.

తెనుఁగులోఁ గథలు వ్రాసినవారు వ్రేళ్లమీఁదిలెక్క వారు. పింగళిసూరన, మంచెన, వేంకటనాథుఁడు, జక్కన, కేతన, గోపరాజు, అన్నయ, కదరీపతి, అయ్యలరాజు నారాయణకవి కథలను వ్రాసినట్టివారు. వీరందఱును చక్కగా రచించినవారే. అందులో మంచెన, కేతన, కదిరీపతిరచనలే యుత్తమమైనట్టివి.

ఉ. కారుమెఱుంగు రాచిలుక, కస్తురివీణ, పదారువన్నె బం
గారము, రస్తుకుప్ప, తెలిగంబుర, వెన్నెలలోని తేట, యొ
య్యారపుఁడెంకి, యందముల కన్నిటికిం దగుపట్టుగొమ్మ, సిం
గారపుదొంతి, యైనకులకాంత నయో యెడబాయనేర్తునే. (౧ వ కథ.)

అనుచో నచ్చతెనుఁగుపదాలకూర్పు నెంతసొగసుగాఁ గావించెనో గమనించుఁడు.

సీ. పా. మంజులద్రుమలతా కుంజపుంజస్థలీ
ఘుటఘుటార్భటిలుఠత్కిటికులము (౨ వ కథ)

క. కుముదబిలంబను నొకపుర
మమరు సురవ్యాజనిశధ్వజానీకమద
భ్రమదప్రమదప్రమదా
సుమదామకటాక్షజనితసూనశరంబై (౧౫ వ కథ.)

ఇత్యాదులందలి సంస్కృతసమాసములకూర్పీకవి యుభయకవిమిత్రుఁడని తెలుపుచున్నది. చిత్రకళా పరిణతిఁ జెందిన చిత్రకారుఁడు తనకుంచెతో రేఖలగీసి రంగులనుంచి యెట్లు మనోహరదృశ్యముల మనయెదుటఁ బెట్టునో యటులే యీకవియుఁ గొన్ని సుందరానుగుణ్యపదములతోఁ దాను వర్ణించినవ్యక్తినిగాని వస్తువునుగాని మనయెదుట ప్రత్యక్ష మగునట్లు చేయును. ఒకపిన్నది క్రమక్రమముగా నెదిగి పెద్దదైనదనుటకు—"అంతనది యంతయై యింతయై వినూత్న పేశలాకారయై మించి పెండ్లి కెదుగ" అని సంగ్రహముగా చిత్రించి నిరూపించెను. ఇతర కవులైదు పద్యాలలో వ్రాసినను మనసులో హత్తుకొనని దృశ్యము నయిదు బిరుదములతో సరిపుచ్చినాఁడు. మేఘము కొద్దికొద్దిగా పెరిఁగి యాకాశమంతయూ నిండుకొనుటను "అప్పుడొక్కించుక మబ్బు గానబడి యింతై, యంతయై, మించి, విష్ణుపదంబంతయు నాక్రమించి" అని మనోహరముగా చిత్రించి చూపించెను.

౨. నుడికారము:—ఇతని శైలిలో జాతీయములు నిండుగాఁగలవు. ప్రాచీనులు జానుతెనుఁగునకుత్తమస్థానమిచ్చిరి. ఈకవి కవితయంతయు జానుతెనుఁగే. తలవెఱ్ఱిగొని, పులిపులియయ్యె, నలినలియయ్యె, గులగులయయ్యె, తుకతుక, సవసవ, పిలపిల, కడుపుచుమ్మలుచుట్టు, పంటపగబట్టె, పుడకలు విఱిచిన,

చింతాకుముడుగుతరి, బుడిబుడియేడ్పు, తక్కులుతక్కు, కనకన నిప్పులు, నీదుశౌర్యముఁగూలన్, బలబలవచ్చు, పొరపొచ్చెము, గాజుగడపికట్లు, గ్రుక్కుమిక్కునక, మెరమెరలు, కుంటిసుంకరి బెదరింపు, ప్రేగులోపలితీట, దట్టిగట్టు, తలతలమని, పదింబదిగ, నీళ్లునమలిన, లేదుబంతి, తలవాకిటకాఁపురమయ్యె,జోకలరేకల, ఇల్లుపట్టకతిరిగెడు, నేలమాలెలుద్రవ్వ, లోసలొటారము, ఇట్టి వెన్నని చూపవలెను. ప్రతిపుటలో నిట్టివి నిండియున్నవి.

ఇతనికవితలో సామెతలకుఁగూడ కొదువలేదు. నక్కగన్న వాఁడెల్లవేటకాఁడు, విపదిద్ధైర్యమథాభ్యుదయేక్షమా, కంచఁబు చెంతపిల్లికరణి, చను మనుచుఁ ద్రోయ విస్తరి చినిగెడు నన్నట్లు, తిరుకొళము లోనఁబడినకోఁతిచందమున, దడిగరవబోవు వేపిచందమున, కుంభంబుమీఁది పొట్టేలుక్రియన్, స్వామి ద్రోహమిదంభారం, తెగువయే దేవేంద్రపదవి, ముగడొల్ల నియాసతిని మారియొల్ల దనంగన్, అడుగువాసినచో నక్కర వాయు, ఇట్టిసామెత లెన్నియో యీకవితయం దిమిడియున్నవి.

3. హాస్యరసము:—సంస్కృతాంధ్రసాహిత్యశాస్త్రము లందు హాస్యరసమునుగురించి నిర్వచించినారు. కాని రెంటను హాస్యరసమునకు తగినరచనలు కానరావు. తిండిపోతు విదూషకుని చచ్చుమాటలు హాస్యజనకములు కాకపోయెను. బూతు మాటలతో వర్ణనలతో భాణాదులందు, చాటువులందు, హాస్యము నుత్పత్తిచేయఁజూచిరి. అది జుగుప్సగా మారెను. మొత్తము తెనుఁగువాఙ్మయములో కదిరీపతివలె చక్కని హాస్యమును పోషించినకవియింకొకఁడు కానరాఁడు.

సీ. వలుదలై మెరయుం పార్వణపుముద్దలవంటి
వలిగుబ్బ లెన్నడు వ్రచ్చికొందు
... ... ... ... ...

గీ. అనుచుఁ గోరుచు నవ్వుచు నాడికొనుచు
సారె గేరుచు చూచినవారు వీని
పుట్టు కిష్కింధలోను గాఁ బోలు ననగ
నాసుశర్మయుం నాత్మగేహమున కరిగె. (౧౪ వ కథ)

సీ. అవున షే! ననువివాహముగమ్ము విద్వాంసు
రాల వయ్యెదవు శీతాంశువదన... (౪ వ కథ)

ఈపద్యాలలోఁ దేలికయగుహాస్యము కలదు.

క. కనుచాటులిండి నడిపిన
పనులం గండలును బెరిగి బకుతండ్రి, హిడిం
బుని కొడుకన, గణనాథుఁడు
ఘనబలమున బిరుదు జెట్టికై వడి మెలగున్... (౧౦ వ కథ)

గీ. దాని నుతియింప దరమానె, తాటకావ
ధూటితల్లియొ, పూతనతోడ బుట్టొ... (౧౭ వ కథ)

ఇందలి యుపమానము లెంత చక్కగా నిమిడినవో గమనింపఁదగినవి.

క. తగిలించుకొన్న పిమ్మట
నిగిలించుటె కాని కార్య మేమున్నది... (౧౧ వ కథ)

ఉ. అక్కట పొట్టచించిన నొకక్షరమైనను రాదు పెక్కులుం
దక్కులుగాని యమ్మనినదమ్మనపేరదు... (౧౪ వ కథ)

సీ. "పోలిరెడ్డికి మగపోడిమి లేదుగా, గాది కేలాగున కడుపు నిక్కె?"
"వదరకే మగవారు వచ్చెద రదె చక్క, జెక్కుకో పయ్యెద చెఱఁగుకొంగు"

"ఓసి లేవే మల్లి! వేసాలు సేయకు, మగవార లెరుగనిమర్మ మెద్ది"
"నీకేటిసిబ్బతిసెరరాగవై మించి, యడగద్రొక్కినదాన వత్తగారి"
"పెద్ది! వినలేదె! మనసుబ్బు పెరటిగోడ
దాటగా మామ గనె నట", "యేటిసుద్ది,
యెసగి మగ డొల్లకున్న నదేమిసేయం,"
ననుచుకసివోవబలుమాటలాడికొనుచు. (౧౪ వ కథ)

ఇట్టి సన్నివేశములందలిహాస్య మానందదాయకమైనది. ఒకస్త్రీ తనభర్తను పురికొల్పుటకై 'చిట్టుబుస్సనుచు నసూయాక్రాంతయై,

గీ. చట్టితోఁ బట్టి పగులంగఁ గొట్టి తనదు
పదరులకు నింటిబలుకుక్క లదరికూయ
నదరు భయమున గ్రుక్కుమిక్కనక వెనుక
వెనుక కొదిగెడు తనప్రాణవిభుని జేరి.

ఇట్లనెను.

"పొరుగింటి పద్మినీసతి, గిరుకుచు మట్టియలు గిలుకుగిలు కని నడువన్
మెరమెరలు పుట్టవే కాఁ,పురమేటికి మగఁడు పొట్టపోయకయున్నన్."
(౨౦ వ కథలో ౧ వ ఉపకథ.)

"గిరుకుచుమట్టియలుగిలుకుగిలుకనినడవన్" అని చదువగానే యాస్త్రీప్రౌఢయనియు, ముత్తైదువయనియు, వయ్యారియనియు, గల్లుగల్లుమని మట్టెలకలస్వనముతో మన సమీపమందే నడిచి వెళ్లిన ట్లనిపించకమానదు. కథాసన్నివేశములందు, వర్ణనలందు, ప్రతిపుటలో నుత్తమహాస్యమును నింపిన యీకవిత మన తెనుఁగు సారస్వతములో క్రొత్తపద్ధతి!

౪. లోకానుభవము:—కదిరీపతి లోకానుభవ మస
దృశమైనది. అతఁడు తానువర్ణించువిషయములను సమగ్రముగా
పరికించి గమనించి(keen observation)నట్టివాఁడు. ఒకయువతి
తన భర్తతోఁ బుట్టినింటికివెళ్లక యెన్నో యేండ్లయ్యెననియు తన
తల్లిదండ్రుల యొక్కయు నన్నయొక్కయు గుర్తే మరచితి
ననియు రాత్రి పల్కుటను నరుగుపై పండిన తెరువరి విని మరు
నాఁ డామెయన్న నని చెప్పి యింటిలోనికిపోఁగా నాకులట తన
భర్తను నమ్మించుటకై కృతకసోదరునితో నెన్నిమాటలు
మాట్లాడెనో చూడుఁడు—

సీ. మన యమ్మకడుసుఖమ్మునసున్న దే,యయ్య, పెద్దవాఁడయ్యెగాఁ, బేర్మి నతని
పోషింతురే మీరు పొరచూపులేక నా,యరిది చెల్లెలివచ్చి యత్తవారు
తోడ్కొనిపోయిరే, దూరంబు గానయే, వార్తయుం వినము మావదినె వేక
టని వింటినే బిడ్డగనియెనొ మగవాని, గనియెనో యది మేలుగాక యాఁడు
దానవై పుట్టి మిమ్ము జూడ గాన కిట్టు
లేను బడుపాటు చాలదా, యెన్నడైన
దలతురా నన్ను మీరు డెందంబునందు
నేల తలతురు, మరచిపోయితిరి నన్ను.

చ. చెలియలి పెండ్లిచేసితిరి, చిల్లరపబ్బము లెన్నియైనశో
భిలె నను నెన్నడైన బిలిపించితిరే పిలిపింపకున్న నే
మలరెడుకూర్మి నాఁడుపడు చాసపడుంగద యంచు పచ్చపో
గులుగలచీర యంప నొనగూడకపోయెనె యేమిచెప్పుదున్.

గీ. ఇపుడు మీపుణ్యమున నాకు నేమికొదవ
యుండె నేను ధరింపగా, నొకరి కీయ
గలదులే యందులకు నంటగాదు మీద
యాలిదాక్షిణ్య మిటువంటిదంటి నింతె. (౧౫ వ కథ)

ఆచతురత వచ్చినవానినోరు తెరువనీయకయే మీఁదమీఁద ఇన్ని కొట్టిపెట్టినది! కవి వర్షర్తువును వర్ణించినా "గొంగడిముసుగుతో గొల్లలు చట్రాతిపై ని బందారాకుపరిచికొనగ" అనును. రాటమును వర్ణించినప్పుడు దానియంగాంగములన్నియు తెలుపును. మద్యపానమునకై వెళ్లువారు "తమ మునిచెరగులందుగాసుదుడ్డును బంగారువ్రాస వెండి తునక, మొదలింటి చిరువాడుగొనిన దెల్లగొంచుచు" వెళ్లిరనును. సంక్రాంతిని వర్ణించుచో "ఇంక నాల్గావంబు లిడనైతి గాయంచు గుమ్మరి నెమ్మది గుందికొనగ" అనును.

౫. స్వాభావికవర్ణనలు :—కవిలోకానుభవము అతని వర్ణన లందంతటను వ్యక్తమగును. తనకథలలో కొరవంజిని, రెడ్డిని, తురకజవానును, చాకలిని, జెట్టిని, కోమటిని, పురోహితుని, గొల్లను, జోగురాలిని, బోగముదానిని మున్నగువారిని వారివ్యక్తిత్వమునకే లోపమునుగావింపక వారిభూషణములను, వస్త్రములను, కట్టు, బొట్టు, వేషాదులను సమగ్రముగా వర్ణించి మనకు ప్రత్యక్షముగాఁ గనిపించునట్లు చేయును. కవికాలమందు తెనుఁగుదేశము గోలకొండసుల్తానుల వశమయ్యెను. అందుచే తెనుఁగుదేశమందు తురకజవానులు జనులను భయపెట్టి జీవించెడివారు. ఒకజవానును కవి యిట్లు వర్ణించెను.

సీ. మెలిపెట్టి చుట్టినతెలిఫరంగిముండాసుపై, లపేటాడఋబ్బినులు జెలఁగు
బంగరువ్రాతలపట్టుహిజారు, కంబరుచీనినిమతాని పాదు నొసలు
తనుకాంతి గనుపింపఁ దలిరు నంగీజోడు, వలిపెంపు కాలువ పట్టెవాటు
బదుదలలోన డాబాకత్తివదలుపా, పోసులు గోరంట బొంలుచుగోట్లు
నడుమసీలున్నతోలు డాల్బైదగుసూప
నభియముగ వెంట నరుదెంచు నభరువాఁడు

సమరు మున్నైదు తేజుతో నరుగుదెంచె
దారుణాకారుఁడైన యుద్దాయుఁడొకఁడు. (౧౪ వ కథ.)

ప్రబంధకవుల నాయికానాయకులకు విరహతాపము వచ్చినవారు పడెడునవస్థ యింతంతకాదు. వారు చంద్రుని, వసంతుని, వాయువును, చెడదిట్టుదురు. చిగురుటాకులను, కమలపత్రములను, ఱేకులను, పన్నీటిని, తెప్పించుకొని వాటిపై పొరలాడుదురు. కోకిలలను, తుమ్మెదలను, రావించి చీవాట్లు పెట్టుదురు. కదిరీపతి నాయికానాయకులందఱును సాధారణ జనులే. కావున వారివిరహతాపముకూడ సహజమైనట్టిది. ఒక పంచాంగపుబ్రాహ్మణునికి విరహతాపము ముంచుకొనిరాగా నతనియవస్థ యిట్లుండెను.

సీ. ఒడిలోన పంచాంగ ముంచుకొన్నదిగాన కెటుపోయె ననుచు నూరెల్ల వెదకు
పనిలేనిపనివీథి జనుచుఁ గ్రమ్మరు నాత్మగృహ మంచు నెంచి యిల్లిల్లుదూరు
అపుడు భుక్తి యొసర్చి యవున షేసంకటితింటినా యని యింటితెరవ నడుగు
కంతుమాయల నుమ్మెత్తకాయదిన్న,పొలుపు సారెకు చెల్వు నప్పుడమివేల్పు.
(౧౪ వ కథ.)

ఒకగొల్లభామకు విరహతాపము కలిగెను. ఆమె యిట్లవస్థపడెను.

సీ. ఆదలించి పిదుకనిమూవు లుండగ వేగ, దోహనధేనువు దూడవిడుచు
బానలోపల పచ్చిపాలుండ మించి చే,మిరియిడ్డ పాల్పొయిమీఁదబెట్టు
పేరి పక్వంబైన పెరుగుండఁ గవ్వంబు, పులిచల్లలో నుంచి చిలుకబోవు.
(౧౫ వ కథ.)

ఈకవి శబ్దాలంకారములజోలికిపోలేదు. మారుమూల పదాలను వెదకివెదకి వేయలేదు. ద్వ్యర్థులను బ్రయోగింప

లేదు. అందందు వ్యాకరణవిరుద్ధ ప్రయోగములున్నను నవి కవి తెలిసియే కావలెనని వాడినవే కావున వాటివల్ల కవితకు న్యూనతకలుగుట లేదు.

౬. సాంఘికచరిత్ర.— 300 ఏండ్ల క్రిందట మన యాంధ్రు లెట్లుండిరి; స్త్రీపురుషులవేషము లెట్టివి. వారి వస్త్రములెట్టివి, ఆభరణములెట్టివి, వారేపరిశ్రమలందు ప్రవీణులు, వారేదేశాలతో వ్యాపారముచేసిరి, వారి వినోదములు, ఆటలు, పాటలు ఎటువంటివి, గ్రామాధికారుల యొక్కయు, తలారులయొక్కయు అధికారములెట్టివి, ఏయే తప్పుల కెటువంటిశిక్ష లుండెను, వివాదముల పరిష్కార మెటుల జరిగెడిది, శైవవైష్ణవమతముల ప్రాబల్య మెంతవఱకుండెను, ఏయేదేవతలను జను లాసక్తితో గొలుచుచుండిరి. ఇట్టి యనేకవిషయముల కీగ్రంథ మొకరత్నాలగని. ఇట్టిగ్రంథాలు కొన్ని యుండినందునను మనపూర్వీకులనుగురించి కొంత కొంతయైనను తెలుసుకొనగలిగినాము.

ఇవి శుకసప్తతిలోని ముఖ్యవిశిష్టతలు. కవి తనను గూర్చి తానే యిట్లు కృత్యాదియందు వ్రాసుకొనినాఁడు.

సీ. కావ్యనైపుణీ శబ్దగౌరవప్రాగల్భ్య, మర్థావనాసక్తి, యతిశయోక్తి
నాటకాలంకార నయమార్గసాంగత్య, సాహిత్య సౌహిత్య సరసముద్ర
సకలప్రబంధవాసన సువాక్ప్రౌఢిమాన్విత చతుర్విధ సత్కవిత్వధాటి
లక్ష్యలక్షణగుణశ్లాఘ్యతాపటిమంబు, నైఘంటికపదానునయనిరూఢి.
గనిన నీకు నసాధ్యంబె గణుతిసేయ
ధాత్రి శుకసప్తతి యొనర్పఁదాడిగోల్ల
ఘనకులకలాప కదురేంద్ర కదురభూప
చెలఁగి వాక్ప్రౌఢిచే గృతిసేయు మనని.

కదిరీపతియనంతరము నూతేండ్లతర్వాతవచ్చిన యయ్యలరాజు నారాయణామాత్యకవి హంసవింశతి యనుకావ్యమును పూర్తిగా శుకసప్తతి ననుసరించియే రచించెను. నూర్లకొలది పద్యాలలో శుకసప్తతిలోనివర్ణనలను, పంక్తులను, మార్పేమియుచేయక స్వీకరించెను. అయ్యలరాజు స్వతంత్రముగా ననుకరణావశ్యకత లేకయే చక్కనికవితను వ్రాయగల శక్తిసామర్థ్యములుకలవాఁడే కాని యతనికి శుకసప్తతిపై యపారాభిమానముండినట్లు రూపించుకొన్నాఁడు.

## ప్రకృతతృతీయముద్రణము

శుకసప్తతిని మొట్టమొదటిసారి ౧౯౦౯ లో కాకినాడలోని సరస్వతీపత్రికవారు ముద్రించిరి. ఆముద్రణమును గురించిన విశేషములు మొదటిముద్రణపీఠికనుండి వెల్లడియగును. తర్వాత ౧౯౩౫ లో వావిళ్లవా రసమగ్రమగు కృత్యాదిపద్యములతో చక్కనియచ్చుతో రెండవముద్రణము కావించిరి. ఇప్పటి యీముద్రణములోఁ బూర్వముద్రణములలోని తప్పులు సవరింపనైనవి. మఱియు కృత్యాదిపద్యములు సమగ్రముగా ముద్రితమైనవి. పాఠాంతరములు కొన్ని యీయఁబడినవి. శుకసప్తతిలో నించుమించు ౧౦౦ పదములర్థముకానివై యందు బహుళపదములు నిఘంటువులలో లేనివై యున్నవి. అట్టిపదములలో ౯౦ పదముల కర్థనిరూపణముచేసి గ్రంథాంతమం దకారాదిగా ముద్రింపనైనది.

ఈముద్రణమువలన కావ్యమందు కొరవడినభాగాలు లభించుట యత్యంత మువావహము.

౧౯౩౫లో కీ. శే. టి. శివశంకరంపిళ్లైగారు తమ అళియ రామరాజు పుస్తకములో శుకసప్తతిలోని కృత్యాదిపద్యాల నుదాహరించినది చూచి వారి కవియొచ్చటలభించెనో వ్రాసి తెలుపుకొని వారిని తొందరపెట్టి మరల పంపుదునని నమ్మకముకలిగించి కృత్యాదిపద్యాలను తెప్పించుకొంటిని. అనంతపురముజిల్లా కదిరితాలూకాలోని పాతర్లపల్లె గ్రామనివాసులగు శ్రీ అంబటి వేంకటరమణప్పశ్రేష్ఠిగారనువారివద్దనుండి యీపద్యాల ప్రతిని శ్రీపిళ్లైగారు సేకరించిపంపించిరి. మార్చి ౧౯౩౫ లో వానిని నేను వ్రాసిపెట్టుకొని శ్రేష్ఠిగారిప్రతిని తిరుగ పంపితిని. “నా ప్రతిలోని పద్యాలను ముద్రించునప్పుడు నాపేరు ప్రకటింపుకొనుడు” అను శ్రేష్ఠిగారికోరికను పరిపాలించినాను.

శుకసప్తతి ౧౭ వ కథలో

“అంతలోనసె శాలివాహనుదివాణమునకు నేఁగుటకై బంధుజనులు గొలువ.”

అనియు, నందే “ధరశాలివాహనుండను” అనియు కవి వర్ణించినాడు. శాలివాహనుని కాలపు కథాసరిత్సాగరమునుండి కథలను పెక్కింటిని స్వీకరించినట్లు ఇవి సూచించును.

ఇప్పుడు లభించినభాగమునుబట్టి కవి నాల్గాశ్వాసములలో (౭౦) రాత్రులలో కథలను చిలుకచే చెప్పించెననియు స్పష్టమైనది.

ఆంధ్రవాఙ్మయమున విశిష్టస్థానమునుబొంది శిరీషకుసుమపేశలమై గులాబీ గుమగుమలతోఁ గూడినదై, ఉత్తమహాస్యరసభరితమై, అత్యంతానందమును కలిగించు ఈ శుకసప్తతి సర్వజనాదరణీయమనుటలో నతిశయోక్తిలేదు.

ఇట్లు,

సురవరము ప్రతాపరెడ్డి.

# ప్రథమముద్రణపీఠిక

ఈగ్రంథకర్త పాలవేకరి కదిరీపతినాయకుఁడు. కృత్యాది పద్యములు దొరకనందున నిక్కవి కాలనిర్ణయాదుల కిచట ననువుపడలేదు. కదిరిరాజ్యమును బాలించినప్రభువు. ఈకదిరి యనునది నెల్లూరుమండలములోనిదని చారిత్రకులగు రావు బహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులుగారు తమయాంధ్ర కవుల చరిత్రములో వ్రాసియున్నారు. మనకుఁ గడపజిల్లాలో నగపడుచున్నది. ఇక్కవికవిత్వము స్వభావసిద్ధములు సమయోచితములునగువర్ణనలతోఁ గ్రొత్తరుచులనుబుట్టించుచుఁ బ్రౌఢమై హృదయంగమ మైయున్నది. సంస్కృతాంధ్రములు రెంటియందును సమానప్రజ్ఞకలవాఁడు. హంసవింశతియందువలె నిందతిగా వర్ణించి యుండలేదు. కాని యవసరముకలిగినప్పుడు చమత్కారములను విడిచిపెట్టలేదు.

ఇప్పొత్తము మాకు మొదట పుదుక్కోటసంస్థానములోని పుస్తకభాండారమునుండి దివానుగారగు మహారాజశ్రీ దివాన్ బహదరు సీలంరామదాసునాయుడు, బి. ఏ., బి. యల్., గారిచే దయాపూర్వకముగా నంపఁబడినది. ఆతాళపత్ర గ్రంథము శిథిలమై యుండినందున శుద్ధప్రతి లేలక మద్రాసు గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సులైబ్రరీలోనున్న దానికొకప్రతి వ్రాసితెచ్చితిమి. అదియు నసంపూర్ణముగానే

యున్నది. ఆప్రతి విద్వచ్ఛిరోమణియు భాషాభిమానియునగు సి. పి. బ్రౌనుదొరవారివలన వ్రాయింపఁబడినది. అందు వారచ్చటచ్చట వ్రాసిన తమ యభిప్రాయముల నీక్రింద నాంధ్ర తాత్పర్యముతో నుదహరించి ఫలితార్థమును గ్రహింపుఁడని పాఠకులకు విన్నవించుచున్నారము.

"This Sukasaptati or Tales of the Parrot in Telugu, being a series of amorous tales. Twenty in number, the book not having been completed, this is very rare and merits publication, as abounding in common colloquial expressions.

This edition was prepared under my directions in the year 1831."

(తా॥ ఈశుకసప్తతి లేక చిలుకచెప్పిన కథలు అనునవి తెనుఁగులోఁ గొన్ని చక్కని శృంగారకథలు. పుస్తకము పూర్తిగా లేదు. ఇవి యిరువదికథలు, సాధారణముగా వాడుక భాషలో వ్రాయఁబడినందున నిదియరుదైనదియు ముఖ్యముగాఁ బ్రకటింపవలసినదియును. ఈవ్రాఁతప్రతి నానియోగమువలన 1831 సం॥ న సిద్ధముచేయఁబడినది.)

మఱియొకతావున (గ్రంథాంతమున) నీక్రిందిరీతిని వ్రాయఁబడియున్నది.

## SUKASAPTATI.

A series of Telugu stories illustrating the various dialects of the Telugu language.

This valuable work is very rare indeed and I never met with a perfect copy. The present one has

been collected with five manuscripts procured with difficulty in various parts of this peninsula.

Had it been composed in times when Telugu learning was patronized, it would have been better preserved; but the compositions of a dark age however valuable are seldom preserved with any care.

This book, "The Seventy Tales of the Parrot" has the same title with the well known Sanscrit composition of which, however, it is not a translation but an imitation. The work seems incomplete, the author not having finished the whole, it is perfect as far as it goes. (Thus there are not in fact 'Seventy' Tales.)

The discrepancies in the various manuscripts of the book are very great indeed, whole lines being substituted one for another. It will therefore be very difficult to select a pure text.

The Hamsa vimsati is a work of the same description and the close resemblance in many passages shows that one must have been borrowed from the other.

Since writing the foregoing remarks I have persuaded Zuluri Appayya, a very eminent Telugu scholar to revise and correct the work. He has done this very carefully and successfully. He considers it to be superior in style and good taste

to the Hamsa vimsati which, however, contains a greater variety of words and technical phrases.

He objects however very justly to the title of the work and proposed to say the THIRTY Tales of the Parrot not the SEVENTY Tales, for the book was never completed.

I have since obtained another manuscript (1839) which contains some additional passages.

(తా॥ ఈశుకసప్తతి ఆంధ్రభాషావైలక్షణ్యమును బ్రకటించు కథలుగలయొక తెలుఁగుగ్రంథము. ఈ యమూల్యగ్రంథముయొక్క ప్రతులు చాలనరుదు. నిండుప్రతి యెక్కడను నాకుదొరకలేదు. ఈదేశమునంగల యనేకస్థలములలోని యైదు వ్రాఁతప్రతులనుబట్టి యతికష్టముపై నీప్రతిని వ్రాయించినాను.

ఇది భాషకు రాజావలంబనము చక్కఁగఁ గలకాలములో వ్రాయఁబడి యున్నయెడల భద్రముగాఁ గాపాడఁబడి యుండును. అవలంబనలేని యిటీవలిదినములలో వ్రాయఁబడిన గ్రంథము లెంతవిలువగలవియైన జాగ్రత్తచేయఁబడియుండ లేదు.

“శుకసప్తతి” యనుపేరుగల ప్రసిద్ధగ్రంథ మొకటి సంస్కృతమునం గలదుగాని యాపేరునే యిదియుఁ గలిగి యున్నను దానికి భాషాంతరీకరణము మాత్రము గాదు. దాని ననుసరించి వ్రాయఁబడినది. ఈగ్రంథమసమగ్రముగాఁ గనఁ బడుచున్నది. దీనింబట్టి చూడఁ గవియే దీనిని బూర్తిచేసినట్లు తోఁచదు. ఇందు డెబ్బదికథలు లేవు.

వివిధ ప్రతులలోఁ బరస్పరవిరోధములు చాలఁ గలవు. చరణములకుఁ జరణములే మార్పులుండుటచే నేది శుద్ధ ప్రతియో నిర్ణయించుట కష్టము.

హంసవింశతియును నిట్టిగ్రంథమే. చాలపద్యము లందు నిందును సరిపోలియుండుటచేత నొకదానిని గాంచి యొకటి వ్రాయఁబడిన ట్లెంచవలసియున్నది.

నే నీగ్రంథమును బరిష్కరించుటలో మిగులసమర్థతగల తెలుఁగుపండితుఁడగు శ్రీజూలూరి అప్పయ్యగారిసహాయమును బొందియున్నాఁడను. అతఁడు మిగులజాగ్రత్తగను జయప్రద ముగను నీకార్యమును జరపినాఁడు. హంసవింశతిలో జాతీయ పదములు విశేషముగా నీయఁబడియుండినను దానికంటె నీగ్రంథమే రచనయందును మాధుర్యమునందును హెచ్చుగానున్న దని యాతఁడు తలంచుచున్నాఁడు.

అయినను నీగ్రంథమున కీపేరు తగియుండలేదని యాతఁడు తలఁచియున్నాఁడు. అది సత్యము. దీనిని శుకసప్తతి యనుటకంటె శుకత్రింశతి యనఁదగునని నుడివినాఁడు. ఎందు చేతననఁగా గ్రంథము పూర్తిచేయఁబడి యుండలేదు గనుక.

తెనుఁగులో శుకసప్తతియను నొకవచనకావ్య మంగ డులలో దొరకునుగాని యిది దానినిబట్టి వ్రాసినపద్యకావ్యము కూడఁ గాదు.

1839సం॥ లో మఱికొన్ని యెక్కువ పద్యములుగల ప్రతి నొకదానిని సంపాదించినాఁడను.) అని దొరగారు వ్రాసి యున్నారు.

ఇంకను మఱికొన్ని పద్యములు వేఱొకప్రతిలో దొరకి నను నవి తప్పులుకుప్పలును సందర్భహీనములునుగా నున్నవి. అవియైనను నాలగవయాశ్వాసము కడవఱకు లేవు. ఒక్కకథ యైనఁ బూర్తి కాలేదు. కావున నీ 4-వ యాశ్వాసములో 21 వ కథ కడకుఁ బూర్తిచేసి మొదటిభాగమని పేరిడితిమి. ఇందుఁ బెద్దకథలు 21 యును నుపకథలు తొమ్మిదియును గలసి ముప్పది కథలుగలవు. ఎక్కడనైన నెక్కుడుకథలుగలపుస్తకము దొరకి నచో మాకుఁ బంపి యీకొఱఁత మావలనఁ దీర్పించి ఆంధ్ర భాషకు మహోపకారముం గావింపఁ బాఠకులం గొనియాడు చున్నాము

సుజనవిధేయుఁడు,

కొచ్చెర్లకోట రామచంద్ర వేంకటకృష్ణరావు,

సరస్వతీపత్రికాధిపతి, కాకినాడ.

# ద్వితీయముద్రణపీఠిక.

ఆర్యులు చేయుపనులన్నియు స్వార్థరహితములు నిహపరసాధకములును. వారు రచియించిన భారతాద్యుద్గ్రంథములు మొదలు కవిచౌడప్పశతకమువఱకు నీతిబోధకములును, ధర్మోపదేశకములును, దన్మార్గమున మోక్షసాధకములు నగుచున్నవి. ఆయాగ్రంథములయందలి విషయమేదైనను దుద కూహించి నచో నది యేదో ధర్మమునో నీతినో బోధించునదిగాయి తీరవలయును. అందుఁ గొన్నింట ధర్మాదులు స్ఫుటముగా నగపడును, గొన్నింట నూహించినం దోఁప గర్భితములై యుండును. పంచతంత్రము, హితోపదేశము, విక్రమార్కచరిత్రమను ద్వాత్రింశత్సాలభంజికలకథలు, తదంతర్భూతములగు బేతాళపంచవింశతి, రేచుక్కపగటిచుక్కకథలు, హంసవింశతి మున్నగునవియెల్ల నీతిబోధకములే. పంచతంత్రాదులు కొన్ని స్త్రీపురుషసామాన్యము లగువిషయములం దెలుపును. హంసవింశతి, యీశుకసప్తతియుఁ గేవల స్త్రీలకొఱకే యని యూహింపవచ్చును. ఇందుఁ గామోద్రేకమునఁ బరదూతికాప్రేరణమునఁ దప్పుత్రోవలంబడఁ బోవుపడఁతులను సన్మార్గమునకుం ద్రిప్పుటకుఁగా ననేకోదాహరణములం దెల్పి శీలభంగము కాకుండఁ జేయుటయే ముఖ్యోద్దేశమైయున్నది. ఇవియన్నియుం బంచతంత్రమువంటికట్టుకథలే ఈకట్టుకథలకు మూలము మహా

భారతములో భీష్ముఁడు చెప్పిన జంతుజాలవిశేషములకథలే కావచ్చును. మఱియు హంస, చిలుకచెప్పుటచేఁ బిట్టకథలునై యున్నవి. కల్పితములేగాని జరగినవై యుండ వలనులేదు. పచ్చిశృంగారము గుప్పించి కథచెప్పినను దుదకు నీతి కనఁబఱుపఁబడుచుండును. అవి నీతికథలను బురస్కరించికొని నీతి తెల్పఁబడుచుండును. ఒక్కదానిలోనికథలసామ్యమింకొక్కదానిలోఁ గనఁబడుచుండును. ఇంగ్లీషుభాషలో నిట్టికథలున్నవో లేవో కాని అరబ్బీభాషలో "అలఫ్‌లైలా" (అరేబియన్ నైట్సు) వేయిరాత్రులకథ లీరీతివియే. హిందూస్థానీలో "శుకశారికల కథలు" (తోతా మైనా) గలవు. వానిలో నొకటి పురుషదుర్గుణముల నెంచి వారల నిందించిన రెండవది పురుషులపక్షము వాదించుచు స్త్రీలయవగుణము లెన్నుచుండును. ఎవరిపక్షము వారు సమర్థించుకొనుట చిత్రము. మనకథలకన్నింటికి సంస్కృతములో మూలములు గలవు. బృహత్కథ, కథాసరిత్సాగరము నిట్టివానికి మూలములుకావచ్చును. ఇందేదేశము వారేదేశము వారి ననుకరించిరో యూహించుట దుష్కరము. బుద్ధిమంతులు సర్వత్ర కలరు. ఏదేశపుఁబండితునకైనను లోకమునకు నీతి బోధించుటకు ధర్మోపదేశముచేయుటకు సద్బుద్ధి పొడముచుండును. వారువారు బోధించుమార్గములు భిన్నములుగా నుండును.

ఈశుకసప్తతి పేరునకు డెబ్బదికథలనియున్నను మనకు దొరకినవి కొంచె మెచ్చుతక్కువ యుపకథలతోఁ గూడ

వానిలో సగమున్నవి. లభించినంతవఱకుఁ జాలమనోహరము లుగా నున్నవి. మొదట నేను శ్రీపోలవరము సంస్థానాధీశుల సరస్వతీపత్రికకై చెన్నపురి దొరతనమువారి ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారములోని పెక్కు తాళపత్రమాతృకలనుండి దీని కొకప్రతికను వ్రాసితెచ్చి ప్రకటించితిని. అప్పటికిఁ గృత్యాది పద్యములు లభింపలేదు. నాయుద్యమము నెఱిఁగియున్న బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవి, ఎం. ఏ., గారు తాము వివిధమండలములలో బహుభాషాగ్రంథ పరిశోధనముం గావింప నేగినతరి సంపాదించిన కృత్యాదిపద్యము లెనుబది మూఁడును బంపిరి. అప్పటికి సరస్వతీపత్రిక నిల్చిపోయినది. కావునఁ గొంతకాల మాపద్యములు ప్రకటింప నవకాశము లేక పోయినది. కాకినాడలో శతావధానులు తిరుపతిశాస్త్రి గారితనయులయొద్ద భద్రముచేయఁబడిన యీపద్యములను నేనే పరిషత్పత్రికలోఁ బ్రకటించుభాగ్యమునందితిని. ఆపద్య ములు గూడ నిందు మొదటఁ జేర్పఁబడి యథాస్థానమున శో భిల్లుచున్నవి. ఇందుఁ గొన్ని వ్రాఁతతప్పులును, లుప్తభాగము లును గలవు ఈపద్యములు లభించువఱకు గద్యములోని-

"శ్రీమత్ఖాదిరీనృసింహకరుణాకటాక్షవీక్షణ సమాగత కవితాధారపాలవేకరికులకలశాంభోనిధి సుధాకరతాడిగోళ్ల కరియమాణిక్యనృపహార్యక్షపౌత్ర... కదురథరామండలాఖం డలపుత్ర...కదిరీపతినాయకప్రణీతంబు ... అనుమాటలంబట్టి విశేషములం దెలిసికొన నసువుపడ లేదు. ఆపాడిమాటలకు

వివరణ మిాకృత్యాదిపద్యములంబట్టి యిట్లు తెలియవచ్చు చున్నది.

చంద్రవంశక్షత్రియులలో నచ్యుతగోత్రజులు పాలవేకరివారను నింటిపేరుగలవారుండిరి. వారికి రాజధాని తాడిగోళ్లపురము. *మొదట పాలవేకరి పెదయోబళరాజు రాయలవారిచే నశ్వవారణరత్ననవరత్నహారాంబరాదులచే బహూకరింపఁబడి, పిదప అళియరామరాజు చేసిన యుద్ధములకుఁ గర్తయై "గదెరాకిమున తెర్క-మొదలుగల్లు" బహురాజ్యమేల సమగ్రమహోహవోగ్రసప్తకసహస్రచాపభృత్సైన్యజితమదాహితెంగాగనుద్రుంద్రై" కోడుగలు మొదలగుగ్రామములను శ్రీఖాదిరీనృసింహమూర్తికి సమర్పించి వన్నెకెక్కినవాఁడు. ఈరాజుకుమారుఁడు నారవిభుఁడు. ఇతనికిఁ దొమ్మండ్రు సుతులు వీరిలో నొక్కఁడగునోబళుఁడు ప్రసిద్ధికెక్కెను ఈ నృపునియగ్రమహిషి బాలమ. ఈదంపతులకు, కరిమాణిక్యరాజుద్భవించెను. ఈతఁడు రామదేవరాయలసరిగద్దియంగూర్చుండుమన్ననంగాంచి యనేకబిరుదములంబడసెను. కరిమాణిక్యరాజునకు లచ్చమ్మ, రాచమ్మ, రంగమ్మ, భద్రమ్మ యని నల్వురుపత్నులు వీరియందు వసంతరాజు, రామరాజు, నారపరాజు, కదురరాజు నను నలుగురు సుతులు జనించిరి. వీరిలో వసంతరాజునకు రామరాజు తనయుఁడయ్యెను. ఈరామరాజు శ్రీరంగరాయలచే మత్స్యమకరధ్వజాదిచిహ్నములంబొందెను.

*శాసనములలో Tadigotla యని కనఁబడునదియే తాడిగోళ్లకావచ్చును.

ఈరామరాజుతనూజుఁడు రఘునాథరాజు. కరిమాణిక్యరాజు రెండవకుమారుఁడు రామరాజు. ఈతనితమ్ముఁడు నారపరాజు. నారపరాజు తమ్ముఁడు కదురత్ప్రాపాలుఁడు. ఈకదురరాజునకుఁ గదురమ్మయే దేవేరి యైనది. ఈసనామదంపతులకు కదురత్ప్రాపాలుఁడు, వేంకటరాజునని యిరువురుతనయులు. ఈయిరువురు సోదరులలోని కదురత్ప్రాపాలుఁడే యీశుకసప్తతిగ్రంథకర్త కదిరీపతి. ఖాదిరీశబ్దమునుండియే కదుర, కదిరిరూపములుకల్గినవి. ఈవంశావళింబట్టి వసంతరాజుకుమారుఁడైన రామరాజు (రెండవ) శ్రీరంగరాయలచే బహూకరింపఁబడినట్లు చెప్పఁబడి నందున శ్రీరంగరాయలు 1572-85 నాఁటివాఁడని తెలియవచ్చు చున్నదికావున రామరాజుపౌత్రుఁడు కదిరీపతికవి 17-వ శతాబ్ద ప్రారంభమునాఁటివాఁడగునని తలంపవచ్చును.

ఈకదిరీపతికవి తనగ్రంథములో నన్నయభట్టారకుఁడు మొదలు తనవఱకుఁగలకవుల మర్యాదల నన్నింటిని బహువిధ ములఁ జేర్చినాఁడని యొక్కమాట చెప్పినంజాలును. స్వభావ వర్ణనల కీతఁడు పెట్టినదిపేరు, సామెతలగని, జాతీయములకు నిధి. అనఁగా ననఁగా నొకపురము-బిడ్డయో పాపయో చిదిమి పెట్టినయట్లు-పుడకలువిఱిచి - చింతాకుముడుఁగుతఱి - మూసిన ముత్తెము-మిట్టిమీనై యదల్చు-బడాపగలఁజూచి-ఎట్లు నోరా. డనో-నీధర్మసత్రపుబ్రాహ్మణుండ - కడుపుచుమ్మలుచుట్టు - పంటఁ

బగపట్టెక్-ఇత్యాదిగా ననేకములు వాడినాఁడు. హాస్యరసము కడ కడుపుచెక్కలగునట్లు నవ్వువచ్చును. హిందూస్థానీపదములం బ్రయోగించెను ఇంగిలీసులముఖామలు, పరాసులు నునితరభాషాపదములు గలవు. సంస్కృతవాక్యములు - "స్వామిద్రోహి మిదం భారం" "విపది ధైర్యమథాభ్యుదయే క్షమా." ఇట్టివి తెనుఁగుపద్యములలో సందర్భోచితముగా సులువుగా నుపయోగించును. సందర్భమునుబట్టి యొకచో వచ్చినపద్యములే వేఱొకచో వాడినాఁడు. ఈకవికున్న ప్రపంచజ్ఞాన మితరకవులలోఁ బలువురకు లేదు.

పురాణాదులు సూతుండు శౌనకాదిమునులకుం జెప్పినట్లుండఁగా నిటీవలిగ్రంథములను రచించినవారు చెప్పువాఁడొక్కఁడు, వినువాఁడొక్కఁడు నుండవలయునని నిర్బంధించుచున్నారు. కొందఱు దైవములకుఁ గృతియర్పించియు, నరులకు నొసంగియు, సూతుండు శౌనకాదిమహర్షులకుం జెప్పినదాని నవధరింపుమని చెప్పఁదొడఁగిరి. దానినిబట్టి యిప్పటికలికాలపు పేదరాసిపెద్దమ్మకథలకుఁగూడ నేనారదుఁడో యేయింద్రునకో చెప్పినట్లుగా నతుకుచున్నారు. ఈశుకసప్తతికథలు కేవల (నీచ) శృంగారకథలు. వీనిని గౌరికి శంకరుఁడు రహస్యముగాఁ జెప్పినాఁడని "ధౌమ్యమహర్షివర్యుండు నిరవధికకుతూహల ధుర్యుండై యిట్లనియె" నని వచించుట యంత సరసముగా

నున్నట్లు తోఁపదు. వ్రతకథలకును గొంద ఱేశివృఁడో యేవిష్ణువో లోకానుగ్రహకాంక్షతో నీవ్రతాచరణమునఁ బుణ్యము గలుగునని దారములేక మఱ్ఱియూడతోరము గట్టుకొన్నను, బియ్యపుపిండిలేక నివ్వరిగింజలు రెండునూటి నైవేద్యము చేసినను జాలును, స్వర్గము చేతిలోనికి వచ్చునన్న చిట్టిచిట్టి వ్రతములు సెలవిచ్చినట్లు కలదు. అందేదో పుణ్యమో పురుషార్థమో యున్నదనుచున్నారుగావున వానికి నమస్కారము. ఇట్టినీరసకథలుకూడ నట్టిమహర్షులు నట్టియుత్కృష్టదైవతములు చెప్పినట్లు కల్పించుట యుచితముగానుండదేమో యని కొందఱికైనఁ దోఁపకమానదు.

హంసవింశతికర్త తనగ్రంథములోఁ బర్యాయపదముల నిఘంటువును గుదిగ్రుచ్చి కథకడ్డువచ్చునట్లుచేసి పాఠకులను బాధపెట్టినాఁడని కొందఱనుచున్నారు. కథ కానిఘంటువు కొంతవఱకడ్డుతగులుచున్నమాట సత్యమే. ఈకవి యట్లు చేయక, అంతకంటె నెక్కుడుమాటలను సందర్భోచితముగ నందందుఁ జేర్చి కథ కడ్డురాకుండఁ జేసి పాఠకులమెప్పునకుఁ బాత్రుండయ్యె ననవచ్చును. ముప్పదికథలలోనె యిన్నిచమత్కృతులున్నవియే, డెబ్బదిలో నెన్నియున్నవో! అవి మనకు లభింపలేదయ్యెఁగదా యని విచారపడవలసివచ్చినది. ఈచక్కని వాఙ్జాలము రాజిల్లు నీతనిముఖమున నేరామాయణమో, భాగవతమో మనము వినుభాగ్యముపట్టిన నెంతమనోహరముగ నుండునో గదా!

ప్రథమముద్రణములోని ప్రమాదములు కొన్ని యిందు సవరింపఁబడినవి. పాఠకులే యిందలివిశేషములను గమనింతురు గాకయని విస్తరింపలేదు.

ఇట్లు సుజనవిధేయుఁడు,

కొత్తపల్లి సూర్యారావు.



శ్రీ ర స్తు

# శు క స ప్త తి

## ప్ర థ మా శ్వా స ము*



### కృ త్యా ది



శ్రీకమలాక్షి యై మెలఁగు
సీత తటిద్రుచి నొంద లక్ష్మణ
శ్రీకర బాహుదండమునఁ
జేర్చుధనుర్లత యింద్రచాపశో
భాకృతిఁ దాల్ప మేరుశిఖ
రాశ్రయనీరదలీల సింహపీ
ఠీకమనీయుఁ డౌ జయప
టిష్ఠుని శ్రీరఘురాము నెన్నెదన్. 1

మ. వరవామాంకమృగేంద్రపీఠి నెలమి న్వర్తించి ప్రాంచత్కృపా
కరవీక్షాంకురచంద్రిక న్సకలలోకశ్రేణి నీడేర్చుచుఁ

*ఈ ప్రథమాశ్వాసము కృత్యాది 83 పద్యములును నిటీవల శ్రీ మానవల్లి రామకృష్ణకవి, ఎం. ఏ., గారిచే సంపాదింపఁబడి యాంధ్రసాహిత్యపరిషత్పత్రిక 18 సం॥ సంచికలోఁ బ్రకటింపఁబడినవి.

వరసౌభాగ్యధురీణ యైన జనకరాడ్వంశాబ్ధిజాత న్నువ
ర్ణరుచిస్ఫూర్తిసమేత సీతఁ ద్రిజగన్మాతం బ్రశంసించెదన్. 2

మ. మును శేషత్వముఁ బారతంత్ర్యమహిమంబుం దాల్చి లక్ష్మీ
ప్రియుం, గని సేవించి యతండు రాముఁ డయి జోకన్
ధాత్రి నుండంగ నింపున శేషత్వముఁ బారతంత్ర్య
మహిమంబుం దాల్చి సేవించి మించిన శ్రీలక్ష్మణదేవు
నాత్మఁ దలఁతున్ శ్రీవాక్ప్రభావాప్తికిన్. 3

మ. సిరులొప్పంగ రఘూద్వహుండు సుజనక్షేమంకరోద్వృత్తి
మైనరుదార న్మణిభద్రపీఠమునఁ గొల్వై యున్నచో ఛత్ర
చామరముల్ మ్రోల వహించి చిత్తమలరింపం జాలి భక్తాలి
బంధురపాపౌఘభయఘ్ను లౌ భరతశత్రుఘ్నుల్ ననుం బ్రోవు
తన్. 4

సీ. పరిపక్వసహకారఫలమా సముద్దండ
మహనీయమార్తాండమండలంబు
తూలికాఘటితకందుకమా నభశ్చుంబి
దృఢతరద్రోణధాత్రీధరంబు
బిసకాండవిసరమా యసమత్రిలోకవి
ద్రావణాసురమహారాజబలము
క్రీడానివాసమా కృతశాంబరీభయం
కరనక్రవరగర్భగహ్వరంబు
తే. బళిర యీలీల యని సురల్ ప్రస్తుతింప
నలరి శ్రీరామచంద్రపాదారవింద
వందనానందరససుధాస్పందహృదయుఁ
డగుసుధీమంతు హనుమంతు నభినుతింతు. 5

క. వాణి న్వీణాపుస్తక
పాణిఁ శుకవాణి విపులభాసురపులిన
శ్రోణి న్బలభిన్మణిజి
ద్వేణిం గమలభవురాణి వినుతింతు మదిన్. 6

ఉ. ముద్దులుగుల్కు శైలసుతముందఱ శైశవలీల నాడుచో
నొద్దికనున్న తండ్రి తలయూఁచ జటామకుటాబ్జరేఖపై
నిద్దపునబ్జమోహమున నెమ్మిఁ గరాగ్రము సాఁచువేలుపుం
బెద్ద గణేశుఁ గొల్తు మదభీప్సితకావ్యకళానిరూఢికిన్. 7

మ. కవితాకన్యకల న్సువర్ణసదలంకార ప్రయుక్తిఁ యథా
ర్హవరప్రాప్తి నమర్చి కీర్తినిధులై యాచంద్రతారార్కమై
భువి వర్ధిల్లఁగఁ జేయుపుణ్యుల మదిం బూజింతు వల్మీకసం
భవులఁ వ్యాసులఁ గాళిదాసముఖులన్మత్కావ్యసంసిద్ధికిన్. 8

తే. ధృతి దురాచారమతి నేకదృష్టివలన
బహుపదార్థపరిజ్ఞానపటిమ లేక
కర్ణకటువుగ వదరెడు కాకవులను
గాకవు లటంచు నెంచి తృణీకరించి. 9

వ. ఇవ్విధంబున నిష్టదేవతానమస్కృతియును సకలసుకవిజన పురస్కృతియును గావించి సముంచిత సకలరసానుబంధబంధురంబగునొక్క మహాప్రబంధంబు నకళంకరాకానిశాకరకర నికరానర్గళగళిత సుధారసధారామాధురీధురీణ వాగ్ధోరణీ నిబంధనంబుగఁ జెప్పంబూని యున్న సమయంబున నొక్కనాఁటి శుభావహాగరీయం బైనవిభావరీతుర్యయామంబున. 10

సీ. మరకతంబులయొప్పు మైనుప్పతిలనొప్పు
గోమువాఁ డెలనవ్వుమోముఁవాఁడు
వనజాతములబింక మెనయుకన్గవపొంక
మమరువాఁ డొకవింతకోమువాఁడు
చికిలిక్రొంబగడంపు జిగిగుంపురవణంపు
మోవివాఁ డెనలేనిఠీవివాఁడు
మిసిమిబంగరుచేల పసమించుకటిలీలఁ
జెలఁగువాఁడు శుభాప్తి మెలఁగువాఁడు

తే. దివ్యకోదండశరకాండధృతకరాబ్జ
యుగమువాఁ డెన్న రానిసోయగమువాఁడు
జానకీలక్ష్మణులతోడ స్వామి రాముఁ
డెలమిఁ గలలోన నాచెంత నిలిచె నంత. 11

క. కని విస్మయసమ్మోదము
లెనయ న్భయభక్తియుక్తిహృదయుఁడనగుచుఁ
వినయస్థితి నల్ల జగ
జ్జనకున కే నతు లొనర్చి సంప్రీతుఁడనై. 12

* * * * *

క. ఈవిధమున మాయనుమతిఁ
గావించితివేని సకలకవిబుధజనసం
జీవన మై నీవంశము
పావన మై వెలయు మత్కృపామహిమాప్తిన్. 13

వ. అని యద్దేవుం డానతిచ్చిన మహాప్రసాదం బని యంగీక
రించి యత్యంత భయభక్తి కరకమ్రసమ్రశిరస్కుండ నై

సాష్టాంగనమస్కృతులు గావించి యానందబాష్పంబులు చిలుకఁబులకాంకితగాత్రుండ నై మేలుకాంచి యమందకందళితానందనిష్యందహృదయారవిందుండ నై ప్రభాకరప్రభావిభాసురం బగుప్రభాతంబున సౌశీల్యాదిమాంగల్యహేతుకాల్యకరణీయంబులు నిర్వర్తించి నిరంతరనితాంతతంతన్యమానకాంతికాంతదంతురిత ద్వారబంధసందానితగంధసింధురకరానీతశాతకుంభకుంభసంభృతాంభోవిజృంభమాణధారాభిషిక్తాంభోజవాసినీసంవాసితంబును నిశాత్యంతాసమానవసవాసమాగతరోలంబకదంబవిలంబమానప్రసూనమాలికాలలితనానాసూనవర్ణనీయవర్ణవిచిత్రచిత్రాంబరవితానవిద్యోతమానంబును బృందావనాళిందకళిందనందనీనందనోద్యానపల్లవసుందరీసందోహానందవిహారమాణ ముకుందక్రీడావిలాసచిత్రితభిత్తిప్రభాభాసితంబును వినూత్నరత్నకంబళాస్తరణోపరిభాగవిన్యస్తప్రశస్తనిస్తులగాంగేయవిస్తీర్ణోదీర్ణసూర్యపుటోపధానశయ్యారమణీయంబును నటనటీగాయనగాయనీనాట్యసంగీతసందర్శనాకర్ణనోత్కంఠాయాతపురందరపురసుందరీసందోహవిభ్రాంతికృత్సాలభంజికాపుంజరంజితవలభీప్రదేశప్రభూషితంబును వేదవేదాంగాద్యనేకశాస్త్రరహస్యవిజ్ఞానధురీణవిపశ్చిన్మాహూర్తికసుకవిగాయకమంత్రిపురోహితవిలసితంబును భరతమతంగదత్తిలకోహలాంజనేయశార్ఙ్గదేవమతాదివివిధభరత శాస్త్రవిశారదకుశీలవలలితంబును గమలరాగోపలఫలకాయమానచూతనూతనపల్లవోల్లసితతోరణాలంకృతంబును హిమవాలుకాచూర్ణరంగవల్లీవిరాజమాన ప్రాంగణదేశదేదీప్యమానంబును సమం

చిత్రానవరతాగురుధూపవాసనావాసితంబును నై విరాజిల్లు నాస్థానభవనరాజంబు వందిమాగధబృందంబు లందందఁ కైవారంబు సేయం బ్రవేశించి బంధుహితామాత్యసామంత జనంబు లభ్యర్ణప్రదేశంబున వసియింపఁ జేరోలగంబున నుండి సముద్భటవీరభటరాహుతసంఘంబుల కొల్వుగైకొని భూసురాశీర్వాదభాసుర మంత్రాక్షతంబు లుత్తమాంగం బునకుఁ ధరియించి విద్వజ్జనంబులకు నమస్కరించి స్వప్నప్ర కారంబు విన్నవించిన విననవధరించి వార లిట్లనిరి. నీలనీరద శ్యామాకృతియగు రఘుపతి ధనుర్బాణపాణియై మ్రోల నిల్చుటం జేసి దిగ్విజయంబు సకలజగన్మాత యగు సీతసందర్శ నంబువలన నిరంతరసంపత్పరంపరావాప్తి యగునిజాగ్రజన్మ సేవాశుభలక్షణుం డగులక్ష్మణవిలోకనంబుకతన గురుభక్తి యుక్తియును గలుగు నీస్వప్నంబు వివిధశోభనప్రయత్నం బులు దెలుపుచున్నయది. నీయట్టికృతార్థున కిట్టిమహత్త్వం బు లబ్బుట యాశ్చర్యంబె మహావంశసంభవుండవు ధైర్య స్థైర్యశౌర్యౌదార్యగాంభీర్యలతాలవాలంబగు భవద్వంశా వతారం బభివర్ణించెద మాకర్ణింపుము. 14

తే. సారమై శౌరికేళికాసారమైన
పాలమున్నీటివలన సంభవము నొందెఁ
గువలయామోదకారియై కుటిలచక్ర
హారియై సత్కళాధారి యైనరాజు. 15

క. ఆయమృతాంశుఁడు త్రిజగ
ద్ధేయుం డగురోహిణీయుఁ గిల్పిపహారణో

పాయుఁ సంశ్రితనికరవి
ధేయు న్బుధనామధేయు ధీయుతుఁ గాంచెన్. 16

క. అతనికిఁ గల్గెఁ బురూరవుఁ
డతఁ డాయువుఁ గాంచె నహుషుఁ డాపుణ్యునకున్
సుతుఁ డతఁడు కనియెఁ దనయుం
దతవిభవోన్నతి యయాతిఁ దద్వంశమునన్. 17

మ. భువనాధారవిహారి యైనహరి యాపుణ్యాత్మునామంబుచే
భువి భాసిల్లు కులంబునన్ హరిహరాంభోజాసను ల్మెచ్చ సం
భవుఁడై ధాత్రి నరాతిజాతిభయకంపం బెల్ల వారించి సం
స్తవనీయుం డన నొప్పె నాతఁడు యదుస్వామిభర్త యౌ ల్పున్
మహిన్. 18

ఉ. ఆరసికావతంసకుల మాత్మసముద్భవహేతుభూతమై
ధీరతఁ బాలవెల్లి జగతిం దగెఁ దన్మహిమం బపారగం
భీరఘునాఘుసంభరణభీమబలప్రతిభాప్తిఁ గాంతు నం
చారయఁ బాలవేకరికులాఖ్య వహించె నుదంచితోన్నతిన్.

ఉ. ఆమహితాన్వవాయవసుధాధిపు లచ్యుతగోత్రపాత్రు లు
ద్దామభుజాపరాక్రమవిదారితఘోరమదారివీరులై
భూమి భరించి రానృపుల భూతి మహోన్నతి నేలె భోగసు
త్రాముఁడు తాడిగోళ్ళపురధాముఁడు శ్రీపెదయాబళుం
డిలన్. 20

సీ. తనమాట శకయుగంధరలాటనృపవరు
ల్విన యోక్తిఁ గడు గారవించి మెలఁగఁ

దనకీర్తి దశదిగంతరపూర్తి నేవేళ
నిండారుపండువెన్నెలలుగాయఁ
దనథాటి రిపుమహీధవకోటి కద్రిగం
హారకుటీరములఁ గాఁపుర మనుప్పఁ
దనదాన మర్థిలోకనిదాన మనఁ గర్ణ
ఖచరామరాగవై ఖరులఁ బొసఁగఁ

తే. దనమహోగ్రప్రతాప ముద్దండచండ
భానుమండలి నొరయ సౌభాగ్యవిభవ
రాజ్యలక్ష్మీసహాయుఁడై ప్రబలె రూప
భావజనిభుండు పెద్దయాబళివిభుండు. 21

సీ. రాయదత్తాశ్వవారణరత్ననవరత్న
హారాంబరంబు లేయధిపుఁ డందె
నళిరామరాజేంద్రబలనద్రిపులఁ ద్రుంచు
కలని కేధీరుండు కర్తయయ్యె
(?)కదె రాకమున తెర్క మొదలుగల్గు
బహురాజ్య మేశౌర్యమహితుఁ డేలె
గురుదేవతాపాదసరసీరుహార్చనా
పరత నేనిపుణుండు ప్రౌఢి గాంచె

తే. నతఁడు వెలయు సమగ్రమహాహవోగ్ర
సప్తకసహస్రచాపభృత్సైన్యజితమ
దాహితెంగాగ నుద్రుండు(?)తాడిగోళ్ళ
జలధిచంద్రుండు పెద్దయాబళివిభుండు. 22

చ. నరచక్రేశుల నెంచిచూడ హనుమన్నాగారిచిహాఢ్యులై
పరబాణాసనచాతురిం గనిరి తత్ప్రాగల్భ్య మెంతంచుఁ దా

నరచక్రేశత రాయదత్త హనుమన్నాగారిచిహ్నధ్వజుఁడై
పరబాణాసనచాతురిం దనరె నోబక్షోణిపాలుం డిలన్. 23

సీ. క్రోడుగ ల్మొదలైన గురుతరగ్రామము
ల్మహిమఁ జెన్నగు భోగమండపములు
సరసగుబాళించు వరధూపవాసన
ల్వివిధరాజాన్ననివేదనములు
కట్టాణిముత్యాలగట్టిచౌకట్లజో
డరుదైన నవరత్నహారలతలు
కడుదీప్తి మెఱయు నఖండదీపజ్యోతు
లనుపమ సుప్రసూనార్చనములు

తే. మొదలుగాఁ గల్గుకైంకర్యముల నమర్చి
శ్రీకరుం డైనఖాద్రినృసింహమూర్తి
కెనయఁ బ్రహ్లాదుఁ డీతఁడో యనఁగ భక్తి
గలిగి పెదయోబళేంద్రుఁడు వెలయ జగతి. 24

క. ఆపెద్దయోబనృపతికిఁ
గోపకనద్భాస్వదంశుకుముదీభవదా
ఘోపాలసమదవదరి
క్ష్మాపాలకుఁడైన నారశౌరి జనించెన్. 25

సీ.

సలుపఁ డనుచు

జీవనం బొసఁగి రక్షింపఁ జాలుఘనుండు
చంచలాత్మకతగర్జించు ననుచుఁ

దాభోగియై యనంతాభిధానుఁడు జగ
త్ప్రాణాపహారియై

ణ్యాజనవృద్ధికోర్వఁ డనుచు

తే జలజరిపుమేఘ శేషసూర్యుల హసించి
కాంచె నతచక్రభరణ మార్జించె ధైర్య
మవనిఁ బాలించె నిర్జించె నఘుజనాళి 26

చ. యోబవిభు నారనృపాలుని యోలగంబునం
గలితసుగంధమాల్యవసనంబులతో నెలవై నవక్కలా
కులె యొకరాయ మన్నె దొర
త నుతింప ఫణీంద్రునకైన శక్యమే. 27

సీ. తొలఁగినఁ గడుసూతుదొరలననాయాస
వర్ధితదుఃఖాశ్రువర్షములకుఁ
గొలిచినసరి

ములకు

నాశ్రయించిన భూసురాగ్రేసరులు సేయఁ
దొడఁగిన సవనాగ్ని ధూమములకు
నిడిన సత్రముల నభీష్టమృష్టాన్న భో
జనజనజయజయశబ్దములకు

తే.

నేమిటి కిందని తెలిసి దాఁటు
నేడువార్ధులు గడ వెళ్ళఁ దాడిగోళ్ల
నారవిభుని యశఃకాంత నడతవింత. 28

క. మేరుగిరిస్థైర్యనిధియా
నారనృపాలకు

హారులఁ దొమ్మండ్రుసుతుల నతులితమతులన్. 29

క. ఆరమణీయయశోవి
స్తారులలో వినుతిఁ గాంచె సకలధరిత్రీ
భూరితర భారవహ

30

సీ. వరదానవాగ్వైభవముల నీడనవచ్చుఁ
గర్ణుతో శేషదృక్కర్ణుతోడ
నంగసౌందర్యశౌర్యముల జోడనవచ్చు
మారుతో గిరిజాకుమారుతోడ

భవునితోఁ గమలసంభవునితోడ
కలితసాహిత్యకీర్తుల సరి యనవచ్చు
భోజుతో నిర్జితాంభోజుతోడ

తే. ననుచుఁ దను గీ

స్నానదాన
ధర్మగుణముల శోభిల్లు తాడిగోళ్ళ
నారనరపాలునొబళనాయకుండు. 31

చ వననిధిమేటిదానము

లకువాఃపతి మీఁఱు సముద్రవారివా
హానకమతేంద్రసైంధవుల కబ్జుఁడు మిక్కుట మాపగాధిరా
డ్వానధరపాశభృజ్జ 32

రంబుజాసనముఖులలో ననుచు నతని
జేరవకుఁ బిల్చి యొకవేరు చేతికిచ్చి. 552

క. ఇది త్రొక్కినఁ జనవచ్చు
న్నదిఁ దలచినచోటి కభ్రమార్గంబున న
మ్మదవతిఁగలసెదు పోపొ
మ్మెద సందియ మెడలి రాత్రి కేగు మటన్నన్. 553

మ. భృగుఁ డారేయిఁ దదౌషధా ప్తిమహితాంఘ్రిద్వంద్వుఁడై
పోయి యభ్రగతిం దద్గృహాసీమడిగ్గి మరుబాబాఁబోలు
నాబాలతో,నగజేయాదృతిఁగూడి క్రమ్మఱి యతం డాకై
వడిన్రేలుఁత,న్మృగనేత్రామణిపొందుఁబాయకయతిప్రీతాంత
రంగంబునన్. 554

క. ఆమ్మూలికపై దానివి
థమ్మదివ్రాసినపసిండి దగడుపొదివి ప్రా
ణమ్మువలె దాఁచికొని మఱి
యెమ్మెయిఁ గర్జములదాని నేమఱకుండెన్. 555

క. అంత నొకనాఁ డతండు పు
రాంతిక నదిఁ జేర నరిగి యమ్మూలికఁ ద
త్ప్రాంతమున నుంచి దైవా
క్రాంతమతిం డిగ్గి యొడలు కడిగికొనంగన్. 556

తే. రాజశుద్ధాంతపుషితమరాళ మొకటి
యరుణపద్మదళభ్రాంతి నచటనున్న
మూలిక గ్రహించి యవరోధమునకుఁజనియె
భృగుఁడు తదభావమునకు నెవ్వగలఁబొగిలె. 557

ఉ. అంతట నమ్మరాళము విహారమహారతి మంజువాణిగే
హాంతరసీమవైచినఁ దదౌషధముం గొని యవ్విధూటి వి
భ్రాంతతఁ జెంది దానిపయి బంగరుతేకున వ్రాసియున్న య
త్యంతపరిస్ఫుటాక్షరచయంబుఁ బఠించి ప్రమోదమగ్నయై.

క. ఇది త్రొక్కినఁ జనవచ్చు
న్నదిఁ దలఁచినచోటి కభ్రమార్గంబున నం
చొదవిన యాలిపియున్నది
గద దేవునికరుణ మెచ్చఁగావలె ననుచున్. 559

వ. తలంచి బహుకాలాభిలాషితం బగు పరపురుషసంగమం బనుభూతంబైన భంగింబొంగి మనోరథపరంపరాక్రమిత దినావసానయై నిశాసమయంబున రాజకుంజరుండు మణిమంజరీమందిరగతుం డగుట యెఱింగి యక్కురంగనయన తన ముంగిట నిల్చి పదాంగుష్ఠంబులన నయ్యౌషధమూలం బవలంబించి కాళికాగృహంబున కరుగవలయునని తలంచి నిరాధారంబగు గగనాంగణంబున కెగిరి దైవవశంబునం గాళీనికేతనద్వారంబున మొగులుతగులు దిగనాడి యరుగు దెంచిన మెఱుంగుతెఱంగున వ్రాలి కేళికాగతుల మెలంగు నవసరంబున. 560

క. పరనగరరాజసుతుఁ డొ
క్కరుఁ డప్పురమునకు నాత్మకార్యంబునకై
యరుదెంచి యునికి నిజ
తామరసేక్షణఁ దలఁచి యతఁడు మన్మథవశుఁడై. 561

తే. నిదురగానక యొకచోట నిలువలేక
వీథిఁ గ్రుమ్మరుచుండి యవ్వేళనటకు

వచ్చి మరులచ్చివంటి యమ్మచ్చెకంటి
మెచ్చి మరులెచ్చి యంటిన మెలఁతతోడ. 562

తే. పలుకరించి తదాకారభాషణాది
కముల శుద్ధాంతకామినిఁగాఁగఁ దెలిసి
యళికి తలఁకిననాతని తలఁపెఱింగి
యానృపాంగన వేగ డాయంగనరిగి. 563

ఉ. ప్రేమగనంబడం బలుకరించినవాఁడవు పోదువా యయో
నామగవాఁడ లెస్స నిను నమ్మితి రమ్మని పిల్చి కాళికా
ధామమునం బ్రతీచికడఁ దాను నతండుఁ బ్రసూనబాణసం
గ్రామవినోదకేళి సరిగాఁగఁ బెనంగి యనంతరంబునన్. 564

తే. తనచరిత్రంబు నుడివి యాతనివిధంబుఁ
దెలిసి యిఁకమీఁద రాత్రులు దినదినంబు
నిచ్చటికి రమ్ము తఱియైన నేను వత్తు
ననుచు వొడఁబాటు చేసి యవ్వనిత సనియె. 565

క. చని నాఁడు మొదలుగాఁ బ
ర్వినతమితో సజ్జయైన వేళల నృపనం
దనుపొందునడుపుచుండెన్
ఘనతరమునిదత్తమూలికామహిమమునన్. 566

చ. అని సచివేంద్రనందన ధరాధిపుతో వినిపించెనంచుఁ జెం
దిన నెఱనేర్పుతోఁజిలుక తెల్పఁ బ్రభాతముగాఁ బ్రభావతీ
వనరుహగంధి యంతట నివాసముఁ జేరి దినావసానసం
జనితకుతూహలాప్తి నృపచంద్రునిదూతిక వెంటవచ్చినన్.

క. శుకమిట్లను వినవమ్మా
సకియా యలవిక్రమార్కజనవరుఁడు దద

గ్రకథావిధ మడుగన్సం
త్రికుమారి మనంబు గొలుపఁ దెలుపం దొడఁగెన్. 568

తే. దేవ యభిమానధనుని తృతీయభార్య
యైనమణిమంజరీహంసయాన తనదు
ప్రాయ మెల్లను గోర్కులపాలు చేసి
యుపపతిక్రీడ కేకారు చున్నయంత. 569

క ధరపై నిగమావతియను
పురమునఁ గ్రూరుఁడను నామమున నొకశూద్రుం
డరివరనికరభయంకర
కరకరవాలాంకుఁడై జగన్నుతిఁ గాంచున్. 570

క. ఆతనికిఁ జపల యనఁగాఁ
గాతరమృగనయన యొకతె గల దది మదిలో
నీతిగణింపక జార
వ్రాతములకు హృదయ మిచ్చి వర్తిల్లుటయున్. 571

తే. ఆతఁ డది యెఱింగి కామినీహత్య కళికి
యాలిఁ దోడ్కొని పరభూమి కరుగు బుద్ధి
గంధవతి చెంతకరుదేరఁ గలిపయప్ర
యాణముల నంత నచ్చపలాబ్జనయన.  572

ఉ వీఁడిఁక నెన్ని దేశముల వెంబడిఁ ద్రిప్పునో యేమి చేయను
న్వాఁడొకో కాదటంచు జతనంబునఁ గన్ను మొఱంగిపోయిన
న్వాఁడిమి వెంటనే వెదకవచ్చుఁగదా యెటులైన నీతనిం
బోఁడిమి మాన్పి కాని మఱిపోదఁగదంచు విచారఖిన్నయై.

క. పెదవులు తడుపుచుఁ బదములు
గుదిగొనఁగా నొక్కచోటఁ గూర్చుండి యయో
హృదయేశ యిచటి కీడ్చెదొ
కద నాకుం దప్పి వశముగా దని పలుకన్. 574

తే. అతఁడు చోరభయంబున నవ్వధూటి
మేనిసొమ్ములు తనయొడిలోన డాఁచి
నీరపాత్రంబుఁ గైకొని నెమకఁ జనియె
హ్రదనదీకూపముఖ్యంబు లంతలోన. 575

మ. ఒకశూద్రుం డభిరామనాముఁ డొక యుద్యోగంబు పై
వచ్చి య, మ్ముకురాస్యం గని యోఁటినున్న దిది యేమో
యంచు మాటాడనిం,చుకశంకించినఁ జేరఁబిల్చి తన యస్తోక
వ్యథం దెల్పి య,వ్వికచాంభోరుహగంధి వాని మది
యువ్విళ్లూరఁగాఁ జేయుచున్. 576

తే. నీకు నామీఁదఁ గోర్కి జన్మించెనేని
కాఁపురమునకు నుండెదఁ గాని యిటకు
వచ్చు జలములు గొనుచు నావరుఁడు వాని
మొఱఁగిపోయిన వెదకుచు నరుగుదెంచు. 577

తే. కూలికీలారికం బందుఁ గొంటువానిఁ
జెనకి నిర్జించిపోవ నీచేతఁగూడ
దట్టు గావున నిట్లు సేయంగవలయు
నని యుపాయంబుఁ జెప్పిన యంతలోన. 578

ఉ. క్రూరుఁడు నీళ్లఁ గొంచు నటకుం జనుదెంచినఁ దత్ప్రఫుల్లనీ
రేరుహనేత్ర దప్పి యొకరీతి నడంచిన యట్లు చేసి యీ
యూరికిఁ బోయి నేఁ డిచట నుండుదమా యని ముప్వురు

త్రయో, దారతనేగి గంధవతిఁ దద్దయు మెచ్చుచు
వచ్చుచు న్నడన్. 579

క. ఆరమణియు నభిరాముఁడు
గ్రూరుని నిరువంకఁ బెట్టుకొని యయ్యో యీ
యూరికి దొర లేఁడా యీ
చోరుని దండింప ననుచు స్రుక్కక కూయన్. 580

క. ఆమాటవిని తలారుల
దేమని గద్దింప నామృగేక్షణ రొదగా
నామగఁ డితఁడని యయ్యభి
రాముని వెసఁజూపి నిబ్బరంబునఁ బలికెన్. 581

తే. ఆలుమగఁడును నియ్యూరి యలుత నిలిచి
చలిది భుజియింప నాసొమ్ము సంగ్రహించె
గొట్టుసేయక వీనిఁ జూపట్టుకొనుచు
నిచ్చటికిఁ దెచ్చితిమి పట్టుఁ డిప్పు డితని. 582

వ. అనిన విని యన్నగరరక్షకు లాక్షేపపూర్వకంబుగా నతనిం బట్టుకొని బాధించి శోధించి యొడిలోని యాభరణములం గనుంగొని దొంగయగు నని నిశ్చయించి యభిమానధనున కెఱింగించి మూఁడుత్త్తరువులు గైకొని నిజకామినీకుహాన సంజనిత విస్మయాదృతప్రత్యుత్తరుం డగు నతని వధియించి యమ్మండనంబు లిచ్చినం జపలాభిరాములుసంపూర్ణకాములై యథేచ్ఛ నరిగి రాక్రూరుండును నన్యాయహతుం డయ్యెం గావునం బిశాచంబై యాచారవంతులం గని తలంగం బాఱుచు మాంత్రికులం గని గడగడ వడంకుచు నాయుధ హస్తులం జూచి యేచినభయంబునుం బొందుచు భైర

వాజ్ఞావశుండై యాహారంబుఁ గొనంగానక వెఱచినవారి వెంటంబడి తదీయజనప్రకల్పిత రాత్రి కాననంబుల నుద్దండతరజఠరానలంబున శృంగాటకంబులఁ గాఁపుగరిత లగ్నలంబుగా భగ్నునం దరికొన బలియర్పించు పొంగళ్లవలనం గొంతకొంత సంతసించుచు నిడుమలకుం గడగానక యప్పట్టినంబున నెట్టుకొని యున్నవాఁ డగుటం జేసి యతం డొక్కనాఁడు. 583

క. నరపతికిం గానుకగా
విరిపొట్లము గొనుచు నొకఁడు వీథింజనుచో
గురుతర మగు సురుచిరత
త్పరిమళముల వెంటనంటి పాయక చనియెన్. 584

ఉ. భూపతి యంత నవ్విరులపొట్లముఁ గైకొని కొల్వు దీఱి క్రీ
డాపరమైన బాళి నిగుడ న్వెస నంతిపురంబుఁ జేరి కో
మ్మాపువుఁబోణి యంచు మణిమంజరి కిచ్చి తదీయ మన్మథో
ద్దీపితకేళిఁ దేలి పొడ తెంచు రవిం గని లేచిపోయినన్. 585

క. ఆకమలనయన పరసుర
తాకాంక్షల్ నిగుడ నెవ్వఁడైనను మగవాఁ
డీకడకు వచ్చి కోరిక
నాకొనగూర్చునని నెమ్మనంబునఁ దలఁపన్. 586

క. క్రూరుం డప్పుడు తనయా
కారముతో నిలిచి యళుకుగాంచినదానిం
జేరంగ నరిగి వెఱవకు
మోరమణీ వినుము మన్మహోదంతంబున్. 587

చ. అని నిజభార్య చేసిన యపాయమునం దనకట్లు సంభవిం
చిన యశరీరితాస్థితులు చెప్పి యిఁకం జఠరానలంబుచే
తను నెరియం దొడంగె వనితా యిపుడన్నము వెట్టితేని నీ
పనిచిన పంపుఁజేసెద శుభంబగు నీకని మ్రొక్కి వేఁడినన్.

క. అమ్మగువ చపలఁ గూరిచి
యమ్మా భువినాఁటదాన వైనన్నీ చే
యమ్మహితసాహసము నా
కిమ్మా నాకోర్కెలెల్ల నీడేఱుటకున్. 589

క. అని మెచ్చి క్రూరునిం గనుఁ
గొని వాహనమగుచునన్నుఁ గొని చనఁగలవా
మనమునఁ దలఁచినచోటికి
దినదినము నీకు మంచితిండి ఘటింతున్. 590

తే. అనిన నినుమోచికొనుట భాగ్యంబుగాదె
బ్రతికితినటంచు వాఁడొడఁబడినఁ జూచి
యబల బోనంబు వానికాహారమిచ్చి
తోయజానన యర్ధమరేయి వేళ. 591

క. పతి మకరందాగ్రహాసం
గతిఁ గాంచుట దెలిసి గగనగమనక్రూరో
ద్ధతవాహనయై విజన
క్షితి దలఁచుటఁ జనియె కాళిగేహము చేరన్. 592

క. చని వాహనంబు డిగి య
వ్వనితామణి పథికుఁడైన వైశ్యుని నొకనిం
గని తనవర్తన మంతయు
వినిపించి తదీయకథలు విని మోదమునన్. 593

తే. అతఁడు దానును గాలిగేహంబులోన
దక్షిణపుమూల రతికేళిఁ దనివినొంది
యనుదినము నాతఁ డటువచ్చునట్లుచేసి
పోయి యాలీలమెలఁగె నప్పొలఁతి మఱియు. 594

మ. అని రాజన్యున కయ్యమాత్యసుత నిత్యప్రౌఢ వాగ్రూఢిఁ దె
ల్పినటంచుఁ శుకరాజుపల్కునెడ నాళికాప్తభానుప్రభల్
దనర నైశ్యవధూటియంతరనిశాంతంబొందియారాత్రియ
మ్మనుజేంద్రాత్మజుపొందుఁ జెందఁజనుప్రేమన్మంగలన్నిల్చినన్.

క. కని చిలుక నేఁట మాత్రమె
విను మమ్మంత్రిసుత భూమివిభుతో మును జె
ప్పినకథ తేపటికిఁ గథల్
వినిపించిన నరఁటిపండ్ల వేయుము చెలియా. 596

వ. అనినవ్వించియాజవ్వనితోనవ్విహంగమపుంగవం బిట్లనియె.

క. అంతనలవిక్రమార్కుఁడ
నంతరకథ యడుగ మంత్రినందన నవవా
సంతసమయప్రమోదా
క్రాంతవికస్వరపికస్వరంబునఁ బలికెన్. 598

తే. మానవాధీశ యయ్యభిమానధనుని
నాలుగవ కొమ్మ కమ్మకుందనపుబొమ్మ
యైన మకరంద యిచ్ఛావిహారమంద
సందు గానక మందచంచలతఁ జెంది. 599

సీ. నిలనీని వంట వార్పుల నత్తమామల
పోరును లేని కాఁపురముగలిగె

నెచటనుండిన నింట నేమనువారు లే
కింపుపొంపుఘటిల్లు నిల్లుగలిగె
రేలువగల్పట్టి పాలార్పు కోకవేళ
తగ వెంచి చనుదెంచు మగఁడు గలిగె
వలసినయట్టు లవ్వారిగా సారక
స్తూరికాముఖ్యవస్తువులు గలిగె
తే. నెన్ని గలిగిన నేమి నాయిచ్చలోని
యాస గడతేఱ జారవిహారసుఖము
సంభవించ దటంచుఁ గాంతావిశేష
పరవశస్వాంత యగుచుఁ దాపంబుఁజెంద. 600

మ. ఒకనాఁ డాత్మనిశాంతసౌధలసమానోద్యానవీథీసము
త్సుకయైపోయి తదంతరంబున మణిస్తోమాతిధామాతిరం
జకమై యుప్పరమంటు చప్పరమున న్సౌవర్ణడోలావిలో
లకుఁడై నిల్చిన యొక్కసిద్ధుఁగని చాలన్విస్మయంబందుచున్.

క. జారవిహారంబునకే
కారెడు నాకోర్కిఁదీర్పఁగా వచ్చిన య
మ్మారుఁడె యితఁడని యచ్చెలి
చేరం జని చూపువలపుచేతలఁ దెలుపన్. 602

క. నిలిచిన నతఁడాసతికిం
గలకోర్కె యెఱింగి మమ్ముఁ గామింపకుమీ
యిలచూడఁగవచ్చిన సి
ద్ధుల మతనునితూపు మనసుఁ దూఱదు మాకున్. 603

ఉ. ఇందుమనోహరంబయిన యివ్వనవాటిక చూచినప్పుడే
డెందము మమ్మునిల్ప నిట డిగ్గితి మిప్పుడ పోవలెం జిదా

నందవిభూతిగల్గ లలనాజనసంగమసౌఖ్యమేల ర
మ్మిందునిభాస్య నీమది యభీష్టము నీకుటునట్లు చేసెదన్. 604

క. అని చేరఁబిలిచి కర్ణం
బున నొకమంత్రంబు నుడివి పూఁబోఁడి మనం
బున నిది జపింపు మింక గ
గనగమనము గల్గు నీదుకాంక్షలు తీరున్. 605

చ. అని కరుణించి సిద్ధుఁడు వియత్పథజాంఘికుఁడైన మెచ్చి య
వ్వనిత విభాకరుం డపరవార్ధిఁ బడ న్మణిమంజరీగృహం
బునకు నిజేశ్వరుండరుగుపూఁటయటంచునునిశ్చయించి య
మ్మనువు జపించి విష్ణుపదమార్గమునం జనియెన్త్రయంబునన్.

క. చని తత్కాళీగేహం
బున నొక మగనాలికూటమునకై కనుగూ
ర్కనియొక్క జారుతో నిం
పునఁ బొదలుచు నుత్తరంపుమూల రమించెన్. 607

తే. అనుదినము వేళయైనప్పు డవ్వధూటి
యటకుఁ దావచ్చునట్లుగా నతఁడువచ్చు
నట్లుగాఁజేసి యట్టుల నతనిపొందు
విడువఁజాలక మెలఁగెఁ బూవిలుతునాజ్ఞ. 608

చ. మనుజకులేంద్ర యంతనభిమానధనుండొకనాఁటి రేయిఁగాం
చనరుచివారము ల్గలహజారమునం గొలువున్కిఁజేసి య
వ్వనితలు నల్వురు స్మనువు వచ్చుక్రమంబున వచ్చి కాళికా
ఘనగృహసీమఁజేరి రతిఁ గాంచుచునుండిరి నాల్గుమూలలన్.

క. అంతట నభిమానధనుం
డాంతరమునఁ గాళికాపదాంబుజసేవా

నంతరతి వోడమ నుడిగపు
టింతులతోఁ గొలువు దీరి యేతెంచుటయున్. 610

క. వచ్చిన దివ్వటివెలుఁగున
నచ్చెలువలు నాథుఁజూచి రాతఁడుఁ గనియెం
దచ్చపలాక్షులఁ గనుఁగొని
యిచ్చమహాశ్చర్యసమభివృతముగ నిలువన్. 611

క. తరుణులు నలువురు నపుడాం
డొరులచరిత్రంబు లెఱిఁగి యొదవినభయము
న్నిరసించి యొక యుపాయము
దొరకొన విభుఁజేరి ధైర్యధుర్యాత్మకలై. 612

వ. కట్టెదుట నిలువంబడి కాళికాపదాంబుజంబులు భజియింప నింపునం జనుదెంచిన యత్కమలాక్షుల మిన్నలువురము మదీయనాయకులు నేమును ననుదినంబు నిశాసమయంబున నిచ్చటికి వచ్చి పోవుదుము. మాకు నతీతానాగత వర్తమానంబులు తెలియుట కడుగం బనిలే దింత యేల నీయంతరంగంబున భవదీయభార్యాసౌందర్యవిశేషభాషణాదులు మాయందుఁ దోఁచుటం జేసి సందియంబు కందళించినది కావున నింతయుం దెలుపవలసె నచ్చెలువలు మాయంశంబున జనియించినవారలు కావున మాపోలికలు వారికిం గలిగియుండు నయ్యండజయానలకు శుభంబుఁ గోరికదా యేతన్మహాశాంకరీపదపంకజారాధనకు ననురాత్రంబు నరుగుదెంతు మిందు రమ్మని యిందుధరసుందరీ సమీపంబునకు దోడ్కొనిపోయి నిర్మాల్యప్రసాదంబుగా విభూతియొసంగి నీయంగనలసద్ధర్మంబుగా నేలిమామనంబులు

చల్లఁజేయుమని యనిపిన నజ్జననాథుండును నేమియుం బలుక
వెఱచి యూరక వెడలె నప్పుడు. 613

క. అచ్చపలాక్షు లతిత్వర
వచ్చి నివాసముల నిలువ వసుధేశ్వరుఁడుᳵ
ఱిచ్చపడుమనముతో వెస
నచ్చటికి న్వచ్చి వారినందఱఁ జూచెన్. 614

తే. చూచి మనమున మిక్కిలి చోద్యమంది
వార లొనరించునతులోపచారసరణిఁ
దేలి తజ్జాలసంసక్తిఁ దెలియలేక
యధికతరమైన ప్రేమతో నాదరించె. 615

ఉ. మానవనాథ యిట్టియభిమానధనుం డెఱుఁగంగఁజాలెనే
యానలినాయతాక్షులదురాచరణం బదియట్టులే సుమా
యేనరుఁడైన నిట్టి వెతలించుక యైన నెఱుంగఁ డింతటᳵ
మానసవీథిఁ జూచుకొనుమా యికఁ దెల్పఁగ నేర
మేమియున్. 616

తే. అనుచు బాలసరస్వతీవనిత విక్ర
మార్కుతోఁ దెల్పెననుచు శుకాగ్రగణ్యుఁ
డలప్రభావతి కెఱిఁగించునంతలో శ
కుంతములు మేఁతలకుఁ దమగూళ్ళు వెడలె. 617

తే. అంతటఁ బ్రభావతీకమలాయతాక్షి
యాత్మకేళీగృహంబున కరిగి నాఁటి
రేయి నృపుపొందుఁ గోరి చేరిన మనోజు
తేజి యిట్లను దియ్యనితేనెలొలుక. 618

క. నేఁటికథ చిత్రతర మో
బోఁటీ వినవమ్మ మంత్రిపుంగవసుత య
ప్పాటిం దెలిపిననావా
నాటినచింతాభరంబున న్మన మగలన్. 619

తే. కొంతతడవుండి యందు నొక్కింతయేని
దెలియనే యెక్కడిపరాకు పలుకుమనుచుఁ
గదళికాకాంతపైఁ జేతి కమ్మవిరుల
చెండువైచినఁ దత్సతీసరసిజాక్షి. 620

తే. సొమ్మసిలినట్లు వ్రాలినఁ జూచి విక్ర
మార్కభూపాలవరుఁడు హాహానినాదుఁ
డగుచు విలపింపఁ జని వయస్యాజనంబు
శీతలక్రియ లొనరింప సేదఁదేఱె. 621

చ అదిగనిపుష్పహాసుఁ డహహా యనినవ్వఁ బ్రసూనవర్షమ
భ్యుదయము గాఁగ నంతట విభుండు కనుంగొని తీవ్రకో
పుఁడై, యదయుఁడ వింతెకాక యొకయప్పుడు నవ్వని
వాఁడ విప్పుడీ, మదవతి పుష్పపాతమున మ్రాన్పడిన న్వడి
నవ్వ నేటికిన్. 622

చ. అనవిని యయ్యమాత్యుఁడు ధరాధిప మున్నొకయద్భు
తంబు నేఁ, గనుఁగొనఁగంటిఁగాన బహుకాలము తద్వ్యథఁ
గుంది యున్కినే, పనులకు నవ్వకుండితి సభాస్థలి నేఁడొక
యద్భుతంబుఁ జూచినకతనన్మనంబు వికసించిన నవ్వితిఁ
జిత్తగింపుమా. 623

తే. అధిప యీయమ్మవారు మర్యాదపోవ
విడిచి నగరెట్లు వెడలెనో వెడలివచ్చి

తేరుక్రిందటిమరుగుజ్జుఁ జేరి వానిఁ
గలసి యేతెంచు నిది మీకుఁ గానఁబడదు. 624

ఉ. దేవరకొల్వుదేరిన మదీయగృహంబున కేగువాఁడనై
యేవెసఁ బోవుచోఁ గురిసె వృద్ధవరాహకఠోరఘుర్ఘురా
రావమహాశనిధ్వని పరంపరతో నొకవాన మొన్నరే
యావిలమానసాంబుజుఁడనై యొకమండపసీమఁ జేరితిన్.

తే అచ్చటికి వచ్చె నిమ్ముందయాన వచ్చి
తేరుక్రింది ప్రతీక్షణాధీనుఁడైన
గుజ్జుఁ జేరిన వాఁ డతిక్రుద్ధుఁ డగుచు
నింతతడ వేల రావైతివే యటంచు. 626

తే గుండియలు గ్రుళ్లఁ దన్నిన గ్రుక్కుమిక్కు
రనక యాతని కినుక చల్లాఱనిచ్చి
విక్రమార్కుండు నిద్రగావించుదనుక
వెడలి రారాదటంచును వేఁడుకొనియె. 627

తే. అతని పదఘాతముల కోర్చినట్టిదాని
కివ్విరులబంతి వ్రేటున కింతమూర్ఛ
వచ్చెనే యంచు నవ్వితి వసుమతీశ
చనవరియటంచు నాతప్పు సైఁపవలయు. 628

క. అన విక్రమార్కభూపతి
విని వెఱఁగున ముక్కుమీఁద వ్రేలిడి చింతన్
మునుఁగుచు బాలసరస్వతిఁ
గని తెలిసె స్మితహాసకారణ మాలే. 629

తే. కాకయుండినఁ దైలపక్వంబులైన
మత్స్యములు నవ్వునే యంచు మందబుద్ధి

నక్కటా కానవైతి నీహంతలాఁడి
వగలు నమ్మితిఁ గద పతివ్రత యటంచు. 630

క. అని మఱియుఁ బదియుఁబదియును
గనుఁగొని కదళికకు నాజ్ఞఁ గల్పించె న్శా
స్త్రనిరూపితపద్ధతి న
జ్జననాథుఁడు వింటివా నిశాకరవదనా. 631

క. అని చిలుక పలుకఁ బూర్వా
వనిధరశృంగాగ్రమున దివాకరుఁ డెసఁగం
గనుఁగొని ప్రభావతీసతి
చని గృహముననుండి తన్నిశాముఖవేళన్. 632

క. పుడమిదొరఁ జేరు వేడుక
పొడమగఁ జనుదెంచి కీరపుంగవుతో నీ
కడుపెల్లఁ గథలు గద ని
న్నడుగం బనియేమి పోదునా యని పలుకన్. 633

తే. పోయిరమ్మిందువదన యపూర్వమగుచు
నలరు నొకకథ విను విక్రమార్కనృపతి
యవ్విధంబున నిజసతి కాజ్ఞ వెట్టి
పుష్పహాసుని జూచి యింపులు జనింప. 634

శా. ఈయాశ్చర్యము కంటిమేకద పురాదృష్టాద్భుతం బేమియో
యాయాఖ్యానముఁ దెల్పుమన్న నతఁడుద్యత్ప్రీమతో నిట్లను
న్, సాయంకాలనటన్మహానటజటాఝూటాటవీదోధునీ
స్ఫాయద్భంగఘుమంఘుమోపమితవాచాచాతురీధుర్యుఁడై.

శా. వస్వద్రిప్రతిమానధైర్య విబుధధ్వంసిప్రభూద్భూతభీ
నిస్వస్థక్షితిభృద్విరోధిమునిదిజ్నేత్రాబ్జజన్మైణభృ

ద్వాస్వాదిత్యముఖా_ర్తబర్హి_చయదీవ్యద్వారివాహోదయా
భాస్వద్వంశపయోధిశుభ్రకర శుంభత్కుంభకర్ణాంతకా. 636

క. ఖరకరకులశరనిధిశశ
ధర ఖరసురవిమతశమన ధనదసఖధను
ర్ధరణభయదభుజ భవహర
సురవరమునినికరభజిత శుభకరశరణా. 637

స్రగ్విణి.—
మానితాజ్ఞేక్షణా మానిసంరక్షణా
భానుసూనుప్రియంభావుకప్రాభవా
దానసంతుష్టగోత్రాసుధాంధస్స్తుతా
జానకీస్వచ్ఛభూసారసేందిందిరా. 638

గద్యము. ఇది. శ్రీమత్కాదిరీనృసింహకరుణాకటాక్షవీక్షణ సమాగత కవితాధార పాలవేకరికుల కలశాంభోనిధి సుధాకర తాడిగోళ్ళకరియమాణిక్యనృపహార్యక్షపౌత్ర పవిత్రచరిత్ర కదురథరామండలాఖండలపుత్ర విద్వత్కవిరక్షణానుసంధాయక కదిరీపతినాయక ప్రణీతంబైన శుకసప్తతి యను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.



శ్రీ ర స్తు.

# శుకసప్తతి

## చతుర్థాశ్వాసము.

---

క. ... ... ... ... 1

తే. అవధరింపుము సకలరాజాధిరాజ
నతపదాంభోజుఁ డగు ధర్మనందనునకు
సరసవైదికలౌకికాచారవిహిత
హితకథారమ్యుఁ డగు ధౌమ్యుఁ డిట్టులనియె. 2

తే అవధరింపుము విక్రమార్కావనీంద్ర!
చిన్న నాఁడేను మున్ను కాశీపురస్థ
లావలోకనకాంక్షచే నరిగి యరిగి
జంబుకేశ్వర మనుపట్టనంబుఁ జేరి 3

### తొమ్మిదవ యుపకథ.

తే. కంటి పాంథజనాహ్వానకారిమృదుల
వాతపోతచలత్పటకేతనాంక
మై మదీయశ్రమచ్ఛిదాహారి యగుచు
నలరు నొకవంటకూలి యొయ్యారియిల్లు. 4

సీ. హాళిపుట్టించె సద్యఃకల్పితానల్ప
రసపూర్ణగాథాదురంతపటిమ
రక్తి గల్పించె ధారాళవాచాసుధా
మాధురీధుర్య సంగీతరీతిఁ
దెలియఁజేసె ననేకదేశసభాంతరా
రాశికాంతరనికరప్రపంచ
మస్ఫురం బొసఁగె శబ్దార్థవైచిత్రిని
బంధనోజ్జ్వలగద్యపద్యసమితిఁ
తే. దద్గృహాలకన్న కల్పితతారకాయ
మానసోమసమానీతు లైనపథిక
కథికగాయకచారుసత్కవులయుదర
పూర్వగంతరసల్లాపములు నరేంద్ర. 5

చ. చిటిలిననాభినామ మొకచేఁ దెలనాకులు చాయతోఁడి
పుక్కిటివిడెముం బెడంగుగ బిగించినపైఁటచెఱంగులోనఁ బి
క్కటిలు కుచంబులుం బసిఁడికమ్మతళుక్కను చెక్కుదోయి
చొక్కటముగ ముద్దుగుల్కుక్షినొకకల్కి వెసం జనుదెంచి
యచ్చటన్. 6

సీ. మఱివండిపెట్టుకొమ్మలు లేరె మావెంటఁ
బడుదు రటంచును బాయఁబలికి
పోవఁజూచినఁ దిట్టిపోదు రిదేల వా
దాడఁజాల మటంచు నాసగొలిపి
యటువంటివారమా యాఁకలిదీర్ప మి
క్కిలిపుణ్యమన్న నంగీకరించి

కమ్మలు గదలఁ గన్బొమ్మలు నిక్కఁడ
నారజమ్మునఁ గూలి బేరమాడి
తే వచ్చు తెరువరులందఱు వంటపనికి
నన్ను మెత్తురటంచు నందములు సూపి
బాళిపుట్టించు దాని కప్పథికులెల్ల
నోడఁబడి కెమీఁద నే మిన్కు లొసఁగి రపుడు. 7

తే. వారితో నేను భుజియించి వనజబంధుఁ
డ స్తగిరిఁ జేరుతఱియైన నపుడు నదికిఁ
బోవు వారలఁ జూచి నేఁ బోకనిలిచి
సందెవార్చితి జలము లాసతి యొసంగ. 8

క. ఆసమయంబునఁ జీఁకటి
మాసినతనముదుకచీర మైకలనిగ్గు
ల్వాసులకుఁ బెనఁగఁగా నొక
దాసి యరుగుదెంచి యొకసుధాకరముఖితోన్. 9

క. ఏమో గుసగుసలాడిన
నామగువ మతేమిసేతు ననువగుమగ వాఁ
డీమాటకు నోడఁబడఁ డ
క్కామినియెడ మాట నిల్పఁగా లేనైతిన్. 10

క. అనుమాటలు సవసవగా
విని నేనేమో ప్రమోషవిధమని చేరం
జని యది యేమని యడుగం
గనుఁగొని యమ్మగువ ముఖవికాస మెసంగన్. 11

తే. హత్తుకోవచ్చు నీవంటియందగాని
కున్న దొకచోట నొకమంచి యొఱపులాఁడి

దాని కిలికించితంబునఁ దవిలినట్టి
వాఁడు దేవేంద్రునకుఁ జీటివ్రాయఁగలఁడు. 12

మ. అను నమ్మాటలతో డనే రతిపతిజ్యావల్లి కాటీంకృతుల్
విని తా మంచిది పోదునా యనుచు నవ్వీక్షించి యయ్యంబు
జా, నన నేబాసు బలార జాణవపు దన్నా యింత తెంపాం
దకుం, డినవాఁ డేమగవాఁడు నీతపము పండె న్నిండె
సౌఖ్యస్థితుల్. 13

తే. పట్టనని యోగి యాగుణభద్రుఁ డనెడు
భూసురుం డొక్కఁ డియ్యూర వాసిగనియె
వానిబంటున కున్నయైశ్వర్యగరిమఁ
బడసినఁ గుబేరుఁడైనను బ్రదికిపోవు. 14

మ. అలరుందూపులమన్నె వాని మగవాఁ డన్పించుఁ దత్కాంత
య, య్యలివేణీమణి జారసంగమసుఖై కాకాంక్షచే దీనిని
చ్చలు నాయింటికిఁ బంపు నొక్కనిమహాచాతుర్యధైర్యాప్తి
మె, చ్చులొసంగం దగువానిఁగాఁ బనుపుమంచుం దైన్య
పూర్వంబుగన్. 15

క. ఏనును మాలిమిగల మగ
వానికి నిది యెఱుకసేయ వడవడ వడఁకుం
గాని చన వెఱచుఁ వాఁడ
మ్మానినితోఁబ్రొద్దు కొంచెమా యొనఁగూడున్. 16

తే. అట్టిచో నెట్లు పోవుదు నంటివేని
దద్గృహము చెంత నొక వటతరువు గలదు
దానిపై నెక్కి చీఁకటిగాన నిపుడె
యూడవెంటనె దిగు మొనఁగూడుపనులు. 17

తే. కాంతిమతి దాని పేరు తత్కాంతుఁ డధిపు
డనుపఁగా దూరభూమికి నరిగినాఁడు
నడచి యిచ్చటి కతఁడు రాఁ దడవుపట్టు
వేగఁ జను మిందులకుఁగాను వెఱవవలదు. 18

క. అని నన్నుఁ బలికి దానిం
గనుఁగొని యమ్మగువ కింత కార్యంబో జ
వ్వని వే తెల్పుము పొమ్మని
యనుపఁగ నది వెడలి చనియె నంతట నేనున్. 19

మ. తరలంబైన మనోంబుజంబు ఘనసంత్రాసంబుతోఁ బోరి శం
బరవిధ్వంసి మహాప్రతాపము జయింపం గాంతిమత్యాల
యాంతరముం జేరఁగ నిశ్చయింప వట ముద్యత్రోపధీమ
ల్లీజనైక్య రహిన్నాఖలవెంటనే యరిగి తద్గేహంబునం
డిగ్గితిన్. 20

ఉ. అంతకుమున్నె యచ్చటి కొయారముమీఱఁగ వచ్చియున్న
త, త్కాంతిమతీవధూటి ననుఁ గన్గొని మోమరవాంచి
నిల్చినం, జెంతకుఁ జేరి దాని యిది సిగ్గుపడ న్సమయంబఁ చే
గృహా,భ్యంతరసీమఁ జేర్పుద మటంచు ననుం గొనిపోయి
రిద్దఱున్. 21

చ. బటువులు తాపితాపఱుపు పట్టుతలాడముమీఁదఁ జల్వదు
ప్పటిపయిఁ జప్పరంపుఁజిగి బంగరువ్రాఁతకురాళముం గురం
గటఁ బడిగంబుఁ గంచుదివగంబము గల్గినపట్టెమంచము
త్కటరుచినించ మించు రతిధామముఁ జేరితి నిర్భయంబునన్.

తే. అంతట భుజించి నను వినయంబుదోఁప
మంచమున నున్చి యక్కాంతిమతిని జూచి

యొనసెఁ గదవమ్మ నీమనోభీష్ట మితని
యలరుఁ బ్రాయంబు కొల్లాడు మనుచుఁ బలికె. 23

శా. నన్నీక్షించి సమస్త దేశతరుణీనానారహఃక్రీడలం
గన్నావందపుజాణ విక్కలికి బొంకన్లేదు సుమ్మా మెయిం
జిన్నెల్నించకుమా బయల్పడిన నాచేఁ గాదు సుమ్మా ప్రజం
గన్నుల్మూయఁగ నీకుఁ దెల్పవలెనా కార్యం బకర్తవ్యమున్.

క. అని తలుపుమూసికొంచుం
జనియెం దద్దాసి గడియ చక్కఁగఁ బొంకిం
చి నెలంత యంత తల్పం
బున కొయ్యనవచ్చె నగవు మొగమునఁ దోఁపన్. 25

తే. ప్రథమసంగమకేళి యప్పటికి నంత
ముగ్ధ యనుపించి పిదప నమ్మోహనాంగి
జాతివారాంబుజేక్షణల్ సైఁత మింత
నేర రనిపించెఁ గలయిక యారజముల. 26

మ. సభలోన న్వివరింపరాదె గద తచ్చాతుర్య మెంతంచు నే
నభివర్ణించెద నంశుమత్కరదురాపాంతః పురావాస యా
యిభయానామణి యెందు నేర్చినది హాయీకౌశలం బంచు నే
సభ యాశ్చర్యతఁ జెందితిన్మహిమ నాసాతర్జనీ యోగమున్.

ఉ. ఎంతకునేర రంత తెగియించినవా రది యున్న దేకదా
యంతట తెల్లవాఱిన లతాంగి ననుం బడుకింటి మిద్దెపై
దంతపుమేలుమంచము సుధాకరకాంతగృహాంతరంబులో
నెంతయుఁ జింతలేక వసియింపఁగఁ జేసెను సాహసంబునన్.

తే. రాత్రులెల్లను గేళ్యాగారమున నుంచుఁ
బగలు మేల్మచ్చుపై నుంచుఁ బ్రతిదినంబు
జేర్మి రెట్టింప షడ్రసోపేతములుగఁ
బ్రొద్దుప్రొద్దునఁ భోజనస్ఫురణ లొసఁగు. 29

తే. దానినడకల వగలెన్నిదైనఁ గలవు
చెప్పఁ జిత్రంబు లటమీఁదఁ జిత్తగింపు
మంత నయ్యంతి గర్భచిహ్నములు దాల్చె
వేడుకలు ద్రోచి నామది వెఱపువొడమ. 30

తే. అంత నొకనాఁటి రేయి యేకాంతసదన
సీమ నన్నుంచికొని మున్ను చేర్చియున్న
గంటమాకులుఁ గొని దివ్యాగంబ మింత
యెనయఁగూర్చుండి యాపూర్ణిమేందువదన. 31

సీ. శ్రీమన్మహాగుణాస్థిరగుణభద్రపా
దములకు దేవరదాసియైన
కాంతిమతీదేవి ఘనభక్తినతులు గా
వించి చేయంగల విన్నపములు
మిమ్ము నాపాలిస్వామినిఁగాఁ దలంపుదు
మీమహిమంబులు మీకె తెలియుఁ
గలలోన మీరు సాక్షాత్కరించుటఁ జేసి
గర్భంబు నిలిచె నిక్కంబుగాఁగ

తే. నింటివారెల్ల నామీఁదఁ గంటగించు
టెపుడు నెఱుఁగుదురేకద యింకమీఁద
నేమి కల్పింపఁజూతురో యెఱుఁగరాదు
కరుణ నిల్పుమటంచొక కమ్మ వ్రాసి. 32

క. తనదాసిఁ బనుప నదియుం
ఘనజవమున నేగి చేరి కష్మ యొసంగం
గనుఁగొని గుణభద్రుఁడు చది
వినవాఁడై విస్మయం బవేలముగాఁగన్. 33

క. చింతాక్రాంతుండై యిసు
మంతయు మాటాడకున్న నాతనికుపిత
స్వాంతత్వ మెఱిఁగి దాసి య
నంతత్వర మరలివచ్చి యంతయుఁ దెలిపెన్. 34

సీ. ఆఁడుదియైనచో నడుగఁ గులస్థాన
పౌరుషములతోడఁ బ్రబలువాఁడఁ
గొడుకైనఁ గలదులే గుణభద్రునకు మున్ను
మున్నుగానె పితృణమోచనంబు
జతగూడ మనపురోహితుని రప్పింపరే
పాటించి లగ్న మేర్పఱచుఁగాని
బొడ్డుగోయరె యేమి పురుటింటిలోఁజొచ్చి
మనపతివ్రత బిడ్డఁ గనియెనిప్పు
తే. డనుచుఁ గేరడముల నింటి యమ్మలక్క
లాడికొనఁ జేటికానీత యైనవస్తు
కోటిచే నింత యేమియుఁ గొదవ లేక
కాంతిమతి యంత మగవానిఁ గనియె నధిప. 35

క. కని పెనిచెం దదనంతర
మున భూనాథుండు పనుపఁ బోయిన కార్యం
బొనగూడుకతనఁ గ్రమ్మఱి
చనుదెంచెం దద్విభుండు సదనంబునకున్. 36

తే. నిజసమాగమసంభ్రమోన్నిద్రులగుచు
నింటివార లెదుర్కొన నేగుదెంచి
యాత్మభార్యాచరిత్రంబు లడుగఁ బొక్కి
ఖిన్నుఁడై యున్నవాని నీక్షించి యపుడు. 37

సీ. బెడఁగుఁజూపెడు నూనెముడిలోనుగా నంటఁ
గట్టిన వానెనకట్టుతోడఁ
గస్తూరిపసుపు చొక్కటపుఁ జల్లనితావి
వెదచల్లు పుక్కిటి విడెముతోడ
నిసువుపై పసుపునూనియ జిడ్డులంటిన
చిటికమ్మికుఱుమాపుచీరతోడ
నొసటనందంబుఁ జెందు విభూతిరేఖపైఁ
బొంకంబుగను చుక్కబొట్టుతోడఁ
తే. గాన్పుసంతస మందు మొగంబుతోడ
నడరు మురిపంబుగులుకు నెన్నడలతోడఁ
గాంతిమతి వీఁడె నీముద్దుగాఱు తనయుఁ
డనుచుఁ జేతికి నీయఁగా నవ్విభుండు. 38

తే. కన్నులెఱ్ఱగా నెగాదిగఁ గన్గొని
యాడుగఱచి దీని నాఁటదానిఁ
జంపరాదుగా విసర్జించితి నటంచుఁ
బార్శ్వచరులఁ జూచి పలుకుటయును. 39

చ. కలకల నవ్వి యానెకద కాదనవచ్చునె నన్నువంటితొ[మం
య్యాలి విడనాడ నీయెడ నయారె సెబాసురె యింటివారి
దులమహిమంబుగాక నినుదూఱఁగఁబల్కఁ బనేమి బాపురే
కలియుగమాయటంచు నని కాంతిమతీలలితాంగి వెండియున్.

మ. కలనిక్కంబగు నేయటన్న నిఁక నోఁగాదంచు మాఱాడఁగాఁ
గలనా యింతకు వచ్చినప్పుడును బల్కన్నేర నాకాన్పుర
చ్చలకెక్కెం గద యింక మానుదురె యీసాధ్వుల్ననుం
దూఱఁగా, వెలయం దైవమెఱుంగుఁ గల్లనిజము ల్వీరాడఁ
గా నేమగున్. 41

సీ. నలుగు రుండినచోట నిలువఁగాఁ బెట్టి మా
టాడఁగాఁ గంటిరా యమ్మలార
ననువంటియాఁడుబిడ్డను గన్నవా రింతె
పలుకరే యేమియుఁ దెలియలేని
సబ్బిబు ల్మీరు మీచాటుమాటలు గదా
నానాథు మేలిగుణంబుఁ జెఱచె
దయ యింతలేక యెంతకు నెత్తుకొంటి ర
క్కట మిమ్ముఁ గన్నదిగాక తల్లి

తే. సూర్యుఁడా చూచుచున్నావె చోద్యపడక
యందఱును జేయుపాపపుణ్యంబు లెవరి
నడిగితివి ధర్మదేవతా యమ్మచెల్ల
వింత నావంటి దానికా యింతమాట. 42

తే. అని గయాళించుకొనుచు హస్తాంబుజముల
నలరుపాపని దురదుర నరిగి తొట్ల
లోనఁబడవైచి మొగమునఁ బూను గండు
తోడ బొమముడి నిగుడ నత్తోయజాక్షి. 43

క. మును రాముని మాటలకై
యనలము వెసఁ జొచ్చి వెడలి యలరిన సీతాం

గనకంటె నేను దక్కవె
చని కాళిక చెంత బాససలిపి గెలిచెదన్. 44

మ. అనుచుం గ్రక్కున గేహము న్వెడల దాయాదు ల్మహా
సాధ్వి,ట్లు నినుం బెరొక్కన మింక నీసడియె చాలుం జాలు
రమ్మంచు వెం,టనె రాఁగా నిది యేమొకో యనుచు నానా
మానవు ల్గుంపులై, కనుఁగొంచుం జనుదేఱఁగా నడిచెఁ
దత్కాళీమహాస్థానికిన్. 45

సీ. తనవారు పిలువఁగా వినక బాసయొనర్పఁ
జను టేటికో యని యనెడువారు
నాఁడుఁబుట్టువు చెడ్డదవుఁగదా యిటువంటి
యపకీర్తివచ్చెనే యనెడువారు
నపకీర్తివచ్చిన నడఁపక యింటివా
రగడుచేయుట దోస మనెడువారు
నగ డేమిచేసి రియ్యతివ తానే వారి
కారడి గల్పించె ననెడువారుఁ
తే. జూడవచ్చిన నచ్చుముచ్చో యెఱుంగ
కాడరా దేల యీపాప మనెడువారు
భయలుదేఱిన యపుడె యీపడఁతి జంత
యగుఁజుమా యనువారు నై రపుడు జనులు. 46

వ. వెండియుం దండోపతండంబులుగా మెండుకొని యాలో
కించు పురజనంబుల కోలాహలంబు విచారించి సంభ్రమా
శ్చర్యంబుగా నరిగి యూఁడిగంపుఁ బడఁతులు విన్నవించిన
నన్నగరాధినాథుం డగు నరపాలుండు విస్మయంబున నగరు

వెడలి తత్కాల సన్నిహితు లగు పరిచారకులు గొలువం
జను దెంచి. 47

క. తలతల మని కొండలు బ్ర
ద్దలవా రెడఁగలుగ జడియ ధరణీధవుఁ డ
క్కలకంఠిఁ జేరి యనునయ
ముల మరలమి సమ్మతించి ముందుగ నడిచెన్. 48

తే. అంతఁ దొలునాఁటి రాత్రి రహస్యభంగిఁ
గాంతిమతి తీర్చి నను బందుకట్టి యునికి
నేను నొకజోగి వాల్కంబుఁ బూని భద్ర
కాళి సన్నిధి నుంటి గింకరునిరీతి. 49

తే. అచ్చటికి వల్లభుండు ధరాధినాథుఁ
డాదిగా మూఁక వెంటరా నరుగుదెంచి
కాంతిమతి చేరి తత్కాళి కాపదాబ్జ
ములకు వెస మ్రొక్కి లేచి నిశ్చలత నిలిచి. 50

తే. కదిసి ప్రజలార కంటిమి కాన మనక
చూడుఁడని పల్కి ధైర్యవిస్ఫురణ మెఱయ
జనవరునిఁ జూచి రాజ నాసత్య మిపుడు
విశద మగును పరాకని విన్నవించి. 51

క. నినునంటి భద్రకాళీ
యనయము విభునంటి యీమహాయోగివరే
ణ్యుని నంటినఁ గాక మఱె
వ్వని నంటిన శాస్తి చేయ వలయు న్నాకున్. 52

మ. అని యక్కాంతిమతీవధూటి పలుకం బ్రావిర్భవద్విస్మయం
బున సారెం దలయూఁపసాగె గిరిశాంభోజాక్షి తన్మూర్ధకం

క. అంతటఁ గాంతిమతీసతి
యింతంతనరాని ప్రేమ నిటు సనఁగా దే
శాంతర నానామనుజుల్
సంతసమున నెంచ మిగుల సన్నుతి కెక్కెన్. 59

క. అని యిట్లు పుష్పహాసుఁడు
ననుపమవైఖరుల విక్రమార్కున కెఱిఁగిం
చె నటంచుఁ జిలుక పలుక
న్వనజాప్తుం డెక్కెఁ బూర్వవసుధాధరమున్. 60

వ అప్పుడు ప్రభావతి మనోజరథవిఫలీకృతమనోరథయై యవ రోధంబున కరిగి నిశాసమయం బగుటయు నవ్వసుంధరా పురందరసంగమానందంబు డెందంబునం గల్పించుకొని యనుభవించుచుం జను దెంచు నచ్చంచలాక్షితో ననంతర కథావిధానంబు వినుమని శుకాగ్రగణ్యుం డిట్లనియె. 61

క. అలవిక్రమార్కభూవరుఁ
డలఘుతరాద్భుతయుతాంతరంగుం డై య
వ్వలికథ యడుగంగఁ గుతూ
హలమున నాతనికిఁ బుష్పహాసుం డనియెన్. 62

తే. ఇందులకు నింత విస్మయం బేల విక్ర
మార్క! యిఁక మీఁదఁ గలకథ యవధరింపు
మేను బూర్వక్రమంబున దానియిల్లు
జేరి నిల్చితిఁ దద్రతిస్థితులఁ దెలఁగి. 63

తే. బలి యొసంగినఁ బూజలు సలిపి వేఁడు
కొనినఁ దత్కాంతిమతిమాయ మనమునందు

హత్తుకొని యున్కి చే మానదయ్యె నధిప
కాళికాదేవి నిజశిరఃకంపనంబు. 64

చ. అదిగని పౌరులెల్లను భయంబునఁ దత్పురనాథుఁ జేరి యా
యదన మహాపతివ్రత గుణాంచిత కాంతిమతీలతాంగి నే
ర్పొదవఁగ నిల్పిన న్నిలుపనోపు మఱెవ్వరిచేతఁ గానియ
భ్యుదితశివాశిరశ్చలన మోనృప యంచును విన్నవించినన్.

మ ఇదియానంచు నరేంద్రుఁ డందఱును దోనేతేరఁగా సర్వసౌ
ఖ్యదమౌ కాంతిమతీగృహంబు దరియంగావచ్చి ఫాలంబుఁద
త్పదములోన్ఁకఁగమ్రొక్కి యెట్లయిన నంబామూర్ధకంపంబు
మాన్పి దయంబ్రోవు మటంచు దైన్యగతి గాన్పింపంగఁ
బ్రార్థించినన్. 66

ఉ. ఆలలితాంగి కేళినిలయంబు కవాటము మాటుఁ జెంది భూ
పాలక యింటివా రిడిన బాముల రచ్చల కెక్కినంత యే
చాలదె యింకమీఁదను నిజంబుగ రట్టున కోర్చునంతకుం
దాళునె యీశరీరము వితావిత యెక్కడిజోలి యక్కటా.

తే అరయఁ దోఁబుట్టుపైఁ గల్గు కరుణ నిందు
వచ్చి యీరీతి దేవరవారె యింత
ప్రార్థన మొనర్చుపట్లఁ గాదనఁగఁ దగునె
యైన నొకచిన్న విన్నప మవధరింపు. 68

క. భామాజనసామాన్యము
గా మది నన్నెంచు జనులు గననేఁడు మొదల్
గామహిలోపలఁ గానని
నామహిమ మెఱుంగవలయు నరనాథమణీ. 69

తే. ఇలఁ బతివ్రత లగువారు గలిగిరేని
కాళి యొనరించు నిజశిరఃకంపనంబు
మాన్పు మని చాటఁ బనుపుము మానవేంద్ర
యప్పు డందఱి వగ తెలియంగవచ్చు. 70

క. అని యవ్వధూటి పలుక
న్మనుజకులేంద్రుండు మాఱుమాటాడఁగఁ గొం
కినవాఁడై భువిఁ జాటం
బనిచెం దద్వచనరీతిఁ బ్రకటముగాఁగన్. 71

తే. అంత రాజాజ్ఞ మీఱరాదంచు ధరణిఁ
గలుగుసతులెల్ల వచ్చి నిక్కమగుభక్తి
నెంత మ్రొక్కిన నంతంత కెచ్చుసాగె
ధూర్జటివెలందిమూర్ధవిధూననంబు. 72

తే. కాంతిమతిదక్క మనుజలోకమున నిఁకఁబ
తివ్రతలు లేరటంచు సుదీర్ఘవచన
ముఖరులై జనులాడ నమ్ముదితలెల్ల
సిగ్గుపడి యేగి రప్పు డచ్చెరువుఁ జెంది. 73

ఉ. అంతట రాజమౌళి పునరాగతుఁడై ధరణిన్వధూటికా
సంతతిలోనఁ జూడ నొకసాధ్వియు లేదని యాత్మలోన సి
ద్ధాంత మొనర్చితిన్సముఁగృతార్థులఁ జేయుమటంచు మ్రొక్కినఁ
గాంతిమతీవధూటి యవుఁగాకని కాళిగృహప్రవేశయై.

తే. రాజు మొదలయినవారి దూరమున నునిచి
గర్భగృహమున కరిగి వేగమ కవాట
బంధన మొనర్చి గ్రక్కున భద్రకాళి
డాసి నిలుచుండి ధీరతాడంబరమున. 75

క. నామనసువచ్చుకై వడి
నేమెలఁగినఁ జూడలేక యెవ్వాతెవే యీ
భూమెలు పన్నఁగ వలదిఁక
యీమేరన్నిలువకున్న నిట్టట్టుఁజేతున్. 76

తే. అనినఁ దత్కాళి యెంతకై నను దెగించి
నట్టిదీజంత యేమి సేయంగఁ బూను
నోయనెడుభీతిఁ దలయూఁచు టుడిగినిలువఁ
దరుణి వాకిలి తెఱచి యందఱిని బిలిచె. 77

క. పిలిచిన నరపతి మొదలుగఁ
గలవారలు వచ్చి భద్రకాళీదేవిం
దిలకించి శిరఃకంపము
నిలుచుటకు న్విస్మయాదినిబిడాశయులై. 78

తే. కాంతిమతి భూతలమున సాక్షాత్కరించి
నట్టియయ్యాదిలక్ష్మిగా కరసిచూడ
మనుజకామినిగాదు సుమ్మనియు మఱియు
మఱియు మ్రొక్కిరి వినయసంభ్రమములెనయ. 79

ఉ. ఆసమయంబున న్నరవరాగ్రణి భృత్యులు తెచ్చినట్టి సిం
హాసనమందు నవ్వికసితాంబుజలోచన నుంచి వైభవ
శ్రీసముదీర్ణవృత్తి నభిషేకము చేసి విశేషభూషణో
ద్భాసితచిత్రచేలము లపారముగాఁ గయికాన్క చేసి నా
నాసతు లెల్ల మ్రొక్కఁగ నొనర్చి యనేకకృతప్రణాములై.

తే. సతులొనర్చి మహాపతివ్రత యటంచుఁ
బేరు పెట్టి యలంకృతవారణంబు

పై సమాసీనఁ గావించి పటహముఖ్య
భద్రవాద్యరవంబు లంబరము నిండ. 81

వ. ఇవ్విధంబున నక్కాంతిమతి నూరేగించి నిజగృహబహిర్భా
గంబున గజావరోహణంబు గావించిన యక్కాంతిమతిచేత
సాష్టాంగప్రణామపూర్వకంబుగా ననుజ్ఞాతుం డై యాన్ను
పాలపురుషుఁడు తుండరుగం దక్కినవారలను బాదపరా
గంబు ప్రసాదించి వీడ్కొలుపుచు నమ్మందగమన మంది
రాంతరంబునకుం బోయి. 82

తే. వరము లిచ్చు మహాపతివ్రత యటంచు
నేఁడు కాశీపురాంతరక్షితిజనంబు
లచ్చుమగు భక్తిఁ గానుకల్దెచ్చి చూడ
వేళ గానక యుండఁగా వెలసె నధిప. 83

క. అంతయుఁ గనుఁగొని యింక నీ
జంతన్నమ్ముదురె యెపుడు చంపునొ యనుచుం
జింతించి యళుకుఁ బాయక
యంతం ద్వర వెడలి కాశి కరిగితి నధిపా. 84

శా. గంగాభంగముల న్మునింగి నిగమగ్రామేశ్వరు న్విశ్వనా
థుం గీర్తించుచు మ్రొక్కి డుంఠిగజవక్త్రుంగొల్చి యంతం ద్రివే
ణిం గాయంబుఁ దొలంచి పూర్వకృతనిర్నిద్రాఘములెల్లనీ
రంగతుర్వర్ణకృపారసంబునకుఁ బాత్రంబైతి ధాత్రీశ్వరా!

క. ఆయద్భుతంబు మదిలోఁ
బాయ మనఁగ లేకయుంటిఁ బదపడి సభలో
నీయాశ్చర్యముఁ గని భూ
నాయక తద్విగుణ మగుట నప్పుదయించెన్. 86

క. అని తెలుప విక్రమార్కుం
డనుపమ విస్మయతఁ బుష్పహాసుని మన్నిం
చి నితాంతవిభవసౌఖ్యం
బుననుండె న్వెంట వైశ్యభుజగద్వేణీ. 87

క. అని యిట్లు చిలుక పలుకఁగ
విని మిక్కిలి వెఱఁగుచెంది వెసనంతటిలోఁ
దనచేతి గరలు కనఁబడఁ
జనియెఁ బ్రభావతి రహస్యసదనంబునకున్. 88

తే. కోమటిమెఱుంగుసిబ్బెపుగుబ్బలాఁడి
యంతిపురమున కరిగి సాయంసమయము
గాంచి కైచేసికొని మహీకాంతసంగ
మాభిలాషంబుతోఁ జేర నరుగుదేర. 89

క. కనుఁగొని గుణసాగరుఁడో
వనితా చనియెదవె ధరణివల్లభుకడకుం
జను మిఁక నొకకథ వినుము ని
యనుచుం బలుకం దొడంగె నతివేడుకతోన్. 90

## ఇరువదియొకటవకథ

ఉ. అంగవసుంధరాభరణమై యొక పట్టన మందమొందు మా
తంగతురంగసద్భటకదంబకతాంగతతు ల్చెలంగఁగా
మాంగళికాభిధాన మసమానముగా వహించి యప్పురం
బంగదనామధేయవసుధాధిపుఁడేలు నవేలసంపదన్. 91

ఉ. ఆనరపాలమౌళి కపరాంగము కైవడి నొక్కమంత్రి మే
ధానిధినాముఁడై తగు నతండు నిజాంగన జాయమానశో

ఖానుతశాంత శాంత యనుబాలికఁగాంచి దివంబుకేఁగ సం
తానముఁగోరి లోలయను తన్వివరించి రమించె నంతటన్.

ఉ. ఆలలితాంగి కంటికిఁ బ్రియంబగుసొమ్ము ధరించి సేవక
శ్రీలమరించి జిహ్వకు రుచించు పదార్థము లాహరించి యే
వేళఁ బ్రసూనతల్పముల వేడుకమైఁ బవళింపఁ గల్గుటం
జాల మదించి జారజనసంగతికై తిపురు న్మనంబునన్. 93

తే. ఇవ్విధంబున నప్పూర్ణి మేందువదన
యన్యసంభోగసుఖలేశ మబ్బ నేని
యాకసంబైన భేదించి యవలఁబోవు
నంతకుఁ దెగించియున్న యయ్యవసరమున. 94

క. వారింట దేవపూజా
కారిత్వముఁబూని వేదఖనియై వినుతా
చారుఁడై సద్గుణనిధి
చారణుఁ డనఁనొక్క బ్రహ్మచారి చెలంగున్. 95

క. ఈరీతినుండువానిం
జారణు లోపఱచి యొకనిశావేళఁ దమః
పూరితమగు నొకయింటం
జేరిచికొని యిష్టకామ్యసిద్ధిం గనియెన్. 96

క. కని యది మొదలుగఁ దద్రతి
ననుపమ సౌఖ్యాబ్ధి నోలలాడుచు మరునిం
దనబంటుగాఁగఁ దలఁపుచు
ఘనతరగర్వమునఁ గన్నుఁగానక మెలఁగెన్. 97

క. అంతఁ దనసవతిసుత యగు
శాంతం బోషింప మఱచి చారణనిష్ఠ

స్వాంతత్వముఁ జెందిన త
త్కాంతామణి నడక లెల్లఁ గాంచిన యదియై. 98

తే. శాంత శాంతల యయ్యును జతుర యగుట
దీనికి భయంబు చూపినఁ గాని తనకుఁ
బోషణము లేదనుచు డెందమునఁ దలంచి
యోర్చికొనియుండి యంతట నొక్కనాఁడు. 99

చ. జనకునిఁ జేరి యాతనికి సంతసమయ్యెడు మాటలాడి నాం
పెనయఁగ నీవుగాక మఱి యింకొకతండ్రి గలండు నాకుఁ
బొమ్మని పలుకఁగా వినిశ్చలత రాద్భుతుఁడై మదిఁ జెందు సంది
యం, బునఁ దలపోసి యా సచివపుంగవుఁ డెంతయు నాద
రంబునన్. 100

తే. ఇంక నొకతండ్రి గలఁడంటి విందువదన
యతనిఁ జూపెదవే యన్న నవ్వధూటి
మంచిదని రేయి చూపెద నంచుఁ బలికి
యవలికరిగిన నమ్మాట లాలకించి. 101

క. ఆలోలాంగన తగదు
శ్శీలం బిది యొఱేఁగి పతికిఁ జెప్పఁగఁ బూనం
బోలు నని తలఁచి మిక్కిలి
జాలింబడి శాంతఁ బిలిచి సప్రియరీతిన్. 102

తే. అనునయించిన నబ్బాల నైన నేమి
నన్నుఁ బోషించెదేని యెంతయును దప్పు
దాల్తు నని పల్కె నింక న త్తరుణి జనక
భావసంశయ మెట్లు పాపంగవలయు? 103

క. అని పలికి యూరకుండినఁ
గనుఁగొని యూరుజసరోజగంధి విచారం
బొనరించి తెలియఁజాలక
వినిపింపుమటన్నఁ గీరవిభుఁ డిట్లనియెన్. 104

వ. అంత నిశాసమయం బగుటయు నమ్మేధానిధి విభావధీరిత తమఃగపుంజం బగు కేళీమందిరంబున లోలాసమేతుండై యుండి యబ్బాలికం బిలిచి ద్వితీయజనకుం జూపుమనిన కాంత యత్యంతమార్గ్యంబు దాల్చి తదీయచ్ఛాయం జూపిన నతండు నవ్వి లోలం జూచి యేతద్బాలికాలాపంబులకు నీయందు సందియంబుఁ జెందితి నని తద్వృత్తాంతం బంతయుఁ దెలిపి పతివ్రతాశిరోమణి వగు నీకిట్టిగుణంబులు పుట్టునే యని పలుకరించెంగావున నయ్యమాత్యకుమారికకుం గల నైపుణంబు గలిగినం గాక ధరణీభుజంగపుంగవునిసంగతికిం జనఁగూడునే యనునంతలోన నరుణోదయం బైనం బ్రభావతీలలితాంగి శుద్ధాంతంబున కరిగి క్రమంబున దినావసానం బగుటయు. 105

శా. పన్నీటంజలకంబులాడి తొగబాబాపాదుకాకాయపుం
జెన్నెల్రా వ్రేసిన చీరెగట్టి యపరంజిం జిమ్ము నెమ్మేనిపై
మిన్నల్గ్రిమ్మెడు సొమ్ముదాల్చి మహీభృన్మీనాంకజన్యక్రియా
సన్నద్ధత్వముఁ జెంద యందము రహించం జేర నేతెంచినన్.

క. అమ్మ ప్రభావతి రాజగృ
హమ్మున కరిగెదవె మంచి దరుగుదువు వినో
దమ్మగుకథ వినియెదె యని
కమ్మనిచక్కెరలు గెరలఁగా నిట్లనియెన్. 107

## ఇరువదిరెండవకథ

మ. అవనీమండలమండనం బయిన యార్యావర్తదేశంబునం
దు విరాటుం డనురాజు ప్రోవఁ జెలువందుం భద్రకాఖ్యం
బుర, ప్రవరం బొక్కటి యందు విప్రకులపారావారహేలా
హాలం,బవు నీతం డన దేవలాంకుఁ డొకఁ డర్థాపేక్షమై
వర్తిలున్. 108

సీ. అపరకర్మాగతంబైన వస్త్రమెగాని
క్రయలబ్ధవసనంబు కానివావి
పూటపూట పరాన్నభోజనంబె కాని
ప్రియభామనిజభుక్తి పెట్టుమందు
దానలబ్ధంబైన తాంబూలమే కాని
చేనున్న వీడెంబు చెడ్డయొట్టు
వితరణులైన భూవిభులవాకిలె కాని
యింక నిజాలయం బెదురుచుక్క

గీ. గాఁగ నూహించు నప్పాపకర్ముఁ డెంత
యర్థకాంక్షయొ కాని ధనాఢ్యుఁ డయ్యు
జన్మఫలమైన యట్టిసంసారసౌఖ్య
మనుభవింపంగఁ జాలఁడో యంబుజాక్షి. 109

మ. పితృకార్యంబున నొక్కనింట్లకడుతృప్తింజెంది తత్పూజనా
గతపుష్పాదులు దోఁచి యార్ద్రిరసనాంగశ్రాంతి దైన్యస్థితుల్
జతగూడంగ నతండు గేహముల "భిక్షాం దేహి" యంచుఁ గ
దరి, ధ్రతగల్పించుచు తెచ్చి భైక్షము తుదిఁ గయ్యంబు
సేయుఁ బురిన్. 110

క. తోఁడిబడ నొకయింటితిథిఁ
తడవుగ నాపోశనంబు ధరియించి కడుఁ
గడుపెద్ద దక్షిణిండని
యొడబడినంగాని భుక్తి కొగ్గఁడు పడతీ! 111

సీ. గార్హస్థ్యవరులు దక్షిణయుంచు దుడ్డు కా
సులు నిచ్చువానిపై సొరిది వైచు
నడిగితెచ్చిన పోఁకలాకులు మాపటి
వేడుకకాండ్రకు వెల కొసంగు
దినమును ముష్టియెత్తినధాన్యములు దెచ్చి
మారు వేరంబు కోమటుల కమ్ము
నలయకగూర్చి భైక్షాన్నంబు పరదేశ
వివిధమానవులకు విక్రయించు
గీ. నొదవినంతయు టాకుసేయుట యకార్య
మనఁగవచ్చునె లోకుల కైననేమి
యతఁడుదీలమీఁద వచ్చినయప్పుడు నైన
రాక మార్పఁడు కమల విరోధినయన! 112

సీ. మనసుకోరికదీర తనువు నీతనిగాఁగఁ
దలచును యదె పిండదానమన్న
ఘననిదానముగన్న గతి నుచ్చి చంకలు
దాటించు కార్పాసదానమన్న
నరచేతి ముడువగా నది యెంచి యెంపైన
దవ్వేఁగు మహిషప్రదానమన్న
చెలరేఁగి కుప్పిగంతులు వైచి చంగున
దాఁటు నాలింగన దానమన్న

గీ. కాలపురుషాదిదానసంగ్రహణములకు
నెలమి వచ్చినవారితో కలహమాడి
యదను దప్పిన మఱి పాళ్ళకైనబెనఁగు
నాశ బాల్పడి నవ్విప్రపాశవరుఁడు. **113**

చ. సమయము వేచి యాద్విజుఁడు సంక్రమణగ్రహణాదిపుణ్య
కాలము లరుదేర దర్భలు తిలల్ ధరియించినవాని మజ్జన
ప్రమదజనంబు లొల్లమని పల్కినమంత్రము లుగ్గడించి వీ
సముకడగాఁగ గైకొను నసహ్యతరోక్తము లెన్నఁడెన్నడున్

గీ. వ్రతములందున్న చిననాటి వడుగటంచు
దేవతోత్సవమని తండ్రితిథి యటంచు
వాతబేగులు మాన్పి యెవ్వారిగన్న
నేటు నాతఁడు ధనకాంక్ష వీటిబోవ **115**

సీ. అన్నంబు వెట్టింపు నాఁకలిగంటినో
యయ్యవార లటంచు నార్భటించు
పరిహరించినఁబోక బహుసాహసస్ఫూర్తిఁ
బలిమిమీఱఁగఁ దల్పుఁబడఁగఁ ద్రోయు
కూడకుండిన మదుర్ గోడచెంగునదాఁటి
బంతిలో కూర్చుని రంతుచేయు
మేడఁబట్టి ద్రోచిన బడి చెయ్యవిఱిగెనో
కూయంచు మొఱవెట్టు గోపునెఱపు

గీ. నెట్టులయినను భుజియింప కెడసిబోవఁ
డాతఁడు పరాన్నభక్షణాయత్తుఁ డగుచు
బ్రాహ్మణోత్తమజనసమారాధనంబు
శిష్టనుతముగ గృహపతుల్ సేయునపుడు. 116

సీ. సంతలోఁ బ్రత్తి బిచ్చము లెత్తి నూఁటాఁకు
వగల జన్నిదములు వడికి వడికి
నికటకాననభూములకు నేఁగి మత్తియాఁ
కులు దెచ్చి విస్తరుల్ గూర్చిగూర్చి
శాకపుబీజము ల్చల్లి బావులనీరు
చేఁది పోయుచుఁ బైరు చేసిచేసి
వేకువ నంగళ్ల విక్రయవేళల
జాఱిన మిరియంబు లేఱియేఱి
తే. యన్నియును విక్రయించి భార్యాకుమార
ముఖ్యు లాఁకట మ్రొగ్గిన మొగముఁజూడఁ
డాసపడి యేమి కోరిన నాగ్రహించు
జందెములు ద్రెంచుకొని తద్ద్విజన్మఖలుఁడు. 117

తే. ఇట్లు గడియించి ధనమెల్ల నింట నునిచి
యతఁడు పరలోకమెనయఁ దదాత్మజుండు
గర్గుఁ డనువాఁడు కౌమారకలితుఁ డగుచుఁ
దరుణగాణిక్యవిహరణాదరణుఁ డగుచు. 118

సీ. కన్నెఱికంపుబింకముఁబోని నేయాఁలు
వెలఁబెట్టి బలుకు సుద్దులకు లొంగి
రతులకు జాణబేరము లంచు చెలులచేఁ
బరికించు వన్నెచిన్నలకు మఱఁగి
వలచితిరోరి! యీవుల కేమియెడఁబాయ
వలదనుతక్కుమ్రొక్కులకుఁ జిక్కి
సాకటి బిండుగల్ జాతరల్ మొదలుగాఁ
దలపెట్టి గోణుగువింతలకుఁ దగిలి

గీ. పోటు గడియించి రోసంబుఁ బోడముఁ జేసి
కలుపుగోలువహించి పోకలకు నలరి
గర్వ దడ్డంబు లేక బోగంపుఁజెలుల
కై వశముచేసె దనయింటఁగలధనంబు. 119

సీ. జోగి జంగంబు లెచ్చుగఁ బల్కులకు వాఁడు
చెలరేఁగి లంజముండలకుఁ జల్లి
తమకు వేసినవెన్కఁ దాఁ జరించినఁ బట్టి
యనుపకుండఁ దలార్ల కొసఁగి యొసఁగి
కొండెము లెప్పక యుండ విరాటభూ
వరుని వాకిటి చనవరుల కిచ్చి
'దర్పకాకార! దాతలరాయ!' యని వెంటఁ
బడు బట్టువారికిఁ బాఱవైచి
తే. తగులుగా నిచ్చు పీటమర్ద విటచేట
కులకును విదూషకులకు మేకోలు నడపి
తండ్రి గడియించినట్టి విత్తంబువోవ
గుల్లగాఁడయ్యె నవ్విప్రవల్లభుండు. 120

తే. ఇవ్విధంబున లేమివహించి గర్గుఁ
డప్పురము రోసి పరభూమి కరుగుచోటఁ
బ్రబలమగు నొక్క యగ్రహారమున నిలిచి
యతి పిపాసాబుభుక్షాతురాత్ముఁ డగుచు. 121

చ. సకలపురాణము ల్నిగమచర్చ లెఱింగిన వైదికాఖ్యుఁ డౌ
నొకగృహమేధి పిల్వఁగఁ దదుజ్జ్వలమందిరసీమఁ జేరి యిం
చుక తలవంచుచుం బెళుకుఁజూపులతో వెసఁబాద్యమిచ్చుత
న్ముకురకపోలఁగన్గొని కనుఁగవకుం బ్రమదంబువొందఁగన్.

సీ. జాఱు పెన్నెరిగొప్పు జాతమన్యవశిలల్
నించు చేపట్టుగావించు నేర్పు
గిలుకుమెట్టెలు మ్రోయ కేకినీయానంబు
దెలుపుచు శాకంబు దెచ్చు నోరపు
పైటకొంగరవీడ బాహుమూలద్యుతుల్
మించగాఁ గదిసి వడ్డించుతీవి
కమ్మజోడసియాడ కలితకోకిలరుచుల్
రాజిల్ల బెగడ మారడుగు నేర్పు

తే. పతికిఁ జాటుగ నిల్చి తప్పక మెఱుంగు
సొలపుఁజూపుల బెళికిపోఁ జూచుదారిఁ
దియ్యవిలుకానిఁ దెచ్చి ప్రతిష్ఠ సేయఁ
గర్గఁ డిష్టాన్నభుక్తి సోత్కంఠుఁ డయ్యె 123

వ. అయ్యవసరంబున

సీ. మానసాజాతిశ్రమంబు దీటిత్తిపో
గాంతించి నాపైని గాలి విసరె
నటవీచరత్కేకి హర్షావహిత్థంబ
మర్చికోచాటంత మబ్బునోఁచె
పథికయూథములు ప్రాప్యగ్రామములు జేర
నభ్రమంబర మెల్ల నల్లికొనియె
కాంక్ష కన్గొను సైరికవితానములచూపు
మిఱుమిట్లుగొన తీగె మెఱుపు మెఱసె

గీ. తరుణు లధిపులమై వ్రాల నురుము లురిమె
చెలఁగి చాతకినోరొగ్గ చినుకురాలె

నవని నేకార్ణవం బై నయట్లు జలము
వెల్లువలుగాఁగ నొకమహావృష్టిఁ గురిసె. 124

తే. అపుడు వైదికుఁ డాగర్గు నాదరించి
వానతఱియయ్యె రవి గ్రుంకవచ్చె నింక
నెందుఁ జనలేవు శయనింపు మిందె యనుచుఁ
దాను నాతఁడు సమయకృత్యములు దీర్చె. 125

. పవ్వళించిరంతఁ బనిదీర్చి దీపంబు
మలఁపి యద్దగోడ మఱుఁగుగాఁగ
వైదికునిసుధాంశువదనయు శయనించె
పచ్చువింటిరాయఁ డెచ్చరింప. 126

౧. గొనబుం బ్రాయము రూపసంపదయుఁ బేర్కొ ఁగల్గుటల్
మాటికిం, దనువీక్షించుట గర్గభూసురునిమీఁదం గోరుకు
ల్కల్లడు, ల్గొనఁగా నేఁడొకనాఁటిరూత్రమున కీలోలత్వ
మేలంచుఁ జెం,దినధైర్యంబునఁ గొంతసేపునకు నిద్రించె
న్వరాకాంతయై. 127

క. గర్గుఁడు దానిమేనియధికవ్యతిరూపములు న్విలాసనై
రర్గళము ల్విలోకనపరంపరలుం దలపోసి చిత్తభూ
మార్గణఘూమి నొంప నసమంబగు తామస మంకురింపఁగా
నిర్గతభీతి వైదికుఁడు నిద్రవహించుటఁ జూచి గ్రక్కునన్.

. చని దానిపీఁపుపైఁ గర
మునుప న్మెల్కాంచి యాతలోదరి నాథుం
డని యొగ్గ నతఁడు తద్రతి
దనిసి వెస న్శయనభూమిదండకు నరిగెన్. 129

క. అంతట నిశిసమయమునకు
నంతము గలుగుటయు గర్గుఁ డరుగం గని య
క్కాంత నిజాధిపుఁ గనుఁగొని
సంతసమున సిగు సాధ్వసం బొనగూడన్. 130

చ. పదరితి రేమి రాత్రి నగుబాటని యెంచకవచ్చి యంతనే
యుదురె గృహంబులో నితరుఁ డున్కి యెఱుంగరె సిగ్గు
దాఁకదో, మది మగవార లైనను సమస్త మెఱింగినయట్టి
వారికే, ధుది నొకవేళ నేమియును దోఁచదువో గద
యెంచి చూచినన్. 131

క. అనిన విని నేను నిశి మే
ల్కనవే లేవనుచు దానికాంతుం డిదిగ
ర్గునికృత్యమె కావలెనని
ఘనమైన జుగుప్సవాఁడమఁగాఁ గుత్సించెన్. 132

తే. అప్పు డన్నాతి యేరీతి నాత్మమాన
భంగమాచ్ఛాదితంబు చేయంగవలయు
ననఁ బ్రభావతి నన్నేమి యడిగె దవలి
కథ యెఱింగింపుమనిన శుకంబుఁ బలికె. 133

మ. అపుడమ్మానిని యథ్వనీనకృత ధౌర్త్యప్రక్రియల్గాఁ దలంచి
పతిస్వాంత మెఱింగి మోసము జనించెం జూచితే యింకను
న్నిపుణత్వంబునఁ గాని యీవిభునిసందేహంబుపోదం చుదెం
దపుఁదమ్మిందలపోసి యద్భుతరసానందంబుఁ గల్పించుచున్.

ఉ. కంటిరె యెంతవింత కలగన్నపుడెల్లను మీరు వచ్చి న
న్నంటినయట్టులుండు నదియాఁగద రాతిరి మిమ్ముఁ బాసినే

నొంటిగఁ బవ్వళించుటకు నోపక చింతవహింప నంతలోఁ
గంటికి నిద్రవచ్చెఁ గలగంటి భవద్రతి గల్గినట్లుగాన్. 135

తే. వామహస్తము నురముపై వైచి నిదురఁ
జెందుతఱిఁ గానికల గందు రందు రెందు
నవ్విధంబునఁ బవళించి యైనకలయు
గంటి భవదీయ కారుణ్యగరిమవలన. 136

క. అని పలుకు దానిమాటలు
విని నిశ్చయ మని తలంచి విభుఁ డోపద్మా
నన యంత నేర్పుగలిగిన
జనవచ్చు నటంచుఁ గిరచంద్రుఁడు పలికెన్. 137

గీ. ఆప్రభావతి బాగాయె నంచుఁ బలికి
ప్రాగ్దిశాపాండిమముం గాంచి పడకయింటి
కరిగి పగలెల్ల ద్రోచి దినాంతవేళ
యధిపసంగమకుతుకమాస్యమునఁ దోలుక. 138

సీ. కలికి చేర్చుక్కయా గాదుగా కచభృంగ
భంగపాళికకోర పంక్తిగాని
కస్తూరితిలకమా గాదుగా ముఖపద్మ
సక్తశైవాలలేశంబుగాని
రంగులరవికె నారాదుగా కులశైల
గ్రసితనాగేంద్రత్వక్చయముగాని
గతివన్నెచీరె యాగాదుగా తనువిద్యు
తాభాదివారివాహంబుగాని

గీ. కనకమేఖలయాగాదుగా నితంబ
నవ్యకటిదేశకృతతోరణంబుగాని

యనుచు వర్ణింపఁగై చేసికొని యొయ్యార
మమరవచ్చెఁ బ్రభావతీహంసయాన. 139

మ. అప్పు డాచక్కెరదిండిపక్కిదొర యక్కా! నేఁటి కిష్మైని చొ
క్కపు శృంగారము వక్ష్యమాణకథ జోకన్ వింతయయ్యెన్
సుమీ, కృపదళ్కొత్తఁగఁ జిత్తగింపు మని యంగీకారముం
గాంచి నేరుపుమీఱం దెలుపం దొడంగె పలుమాఱుం
దేనియల్ చిందగన్. 140

### ముప్పదియాఱవ కథ

క. సుజనాకరమగు నొకపుర
ము జగజ్జేగీయమాన మొదవగ ముదితా
గజరథ మురుదురరయహయ
భుజవిజయసనాథసుభటభూయిష్ఠంబై 141

క. ఆరాజధాని యేలు గ
భీరుం డనునృపతి యతని ప్రియమంత్రి జర
త్కారుఁ డన వెలయు నతని కు
మారుఁడు గుణశాలి యనఁగ మాన్యతఁ గాంచెన్. 142

గీ. ఆతఁ డొకనాఁడు హారిశర్మ యనఁగఁబరఁగు
నొక్కతైర్థికుం డేతేర నొదవు భక్తి
నతని కిష్టాన్నసంతుష్టి యాచరించి
యర్హసంభాషణంబుల నలరఁజేసి. 143

క. అన్నియుఁ దొరగిన యట్టి ప్ర
సన్నాత్మాకలియుగంబు చటులాఘుతదు
శ్చిన్ను లగుజనుల కేక్రియ
నెన్నగ సద్గతులుగలుగు నెఱిగింపఁగదే? 144

వ. అనిన విని యమ్మహీసురుం డిట్లనియె. 145

సీ. అన్నదానంబు దురంతపాపాటవీ
జాలంబునకు దావకీలగాదె?
సురపితృభజనంబు దురితమేదురధరా
ధరకోటులకు వజ్రధారగాదె ?
కూపకల్పన మహాఘోరదుష్కృతతమః
కాండంబునకు భానుకరముగాదె ?
తరుకోటినిల్పు టుత్కటకల్మషాబ్దిక
లమునకు జంఝానిలంబుగాదె ?

గీ. ధరణి మఱియును భూసురస్థాపనంబు
మొదలుగా నెన్నఁగలపుణ్యములు సెలంగు
నవియ సాలవెన్నజిసాగ్నినవలనార్వ
సద్గతులు గూర్పగ నమాత్య చంద్రతనయ. 146

వ. అనిన విని యమందసందేహాకందళితహృదయారవిందుండై
యమ్మంత్రి నందనుండు. 147

గీ. ముక్తిదోరకదు విజ్ఞానముననెగాని
కర్మమునఁగాని విజ్ఞానగరిమ లేదు
జ్ఞానసత్కర్మహీనులౌ జనులకల్ప
మతుల కేరీతిగల్గు సద్గతులు చెపుమ ? 148

. అనఘాత్మ యనాయాసం
బున కర్మఫలంబు జ్ఞానమునజెంది రయం
బున లింగశరీరము వీ
డ్కొన సద్గతి గాంచు వెరవుగోరెద చెపుమా. 149

చ. అన విని యమ్మహీసురకులాగ్రణి యించుకసేపు కొంతచిం
తన మొనరించి యంతట పితామహుమాట దలంచి మంత్రినం
దను గనువిచ్చి చూచి చిఱునవ్వు కెలంకులచిన్న వెన్నెలల్
చినుకగ నిట్లనుం బ్రముదసింధునిమగ్న మనోంబుజాతుఁడై.

గీ. బంధురశుక! యిది మంచి ప్రశ్న కలియు
గమున పాపాత్మజనులకు గతులుగలుగు
వెరవు దెలిపెద నన్నిట్లు వేఁడ భూత
కరుణగలవాఁడ వగు టెఱుగంగనయ్యె. 151

క. మును బ్రహ్మ దెలిపె భూతల
మున గాశిక్షేత్రరాజమును శ్రీముష్ణం
బు ననాయాసంబున కలి
జనులకు సత్పుణ్యగతు లొసంగు నటంచున్. 152

క. కావేర్యుత్తరభువిసం
జీవనదికి పడమటను నృశేవధికకృపా
శైవనికి దక్షిణంబగు
తావున శ్రీముష్ణవిష్ణుధామము వెలయున్. 153

సీ. శ్రీవరాహస్వామి చిత్తాపకల్పితా
మోదసాగరము శ్రీముష్ణపురము
ప్రతివారసేవకాగతశతక్రతుశూలి
ముఖసరోత్కరము శ్రీముష్ణపురము
ముక్తివధూటిముముక్షుకోటివిధూత
మోహనాకరము శ్రీముష్ణపురము
నటతపురోమణి ఘటితనూపురరావ
ముఖరితాంబరము శ్రీముష్ణపురము.

గీ. స్మరణమాత్ర వినిర్ధూత సకలపాప
మూలసంతతివరము శ్రీముష్ణపురము
దర్శనాలోలహృదయకందళితలసద
మోఘసుజ్ఞానధరము శ్రీముష్ణపురము. 154

క. శ్రీముష్ణము శ్రీముష్ణము
శ్రీముష్ణం బనుచుఁదలప జీవుఁడు కర్మ
గ్రామము దహించి గర్భ
స్తోమప్రాప్తులను నడుచు ద్రోవలు మఱచున్. 155

సీ. పొందుగోరదు నిజభుక్తి కాలాగతా
గాధబాధాకరవ్యాధిచయము
చెరలు పోదు దురంతచింతాతిసంతాప
కృతిమహిన్ని ద్రదరిద్రరవము
తొంగిచూడదు మనోభంగపారంపరీ
విత్రాసజనతతాపత్రయంబు
తడవఁబోవదు మహోద్దామకామక్రోధ
మాత్సర్యద్రోహాదిమదకులంబు

గీ. మించి శ్రీముష్ణమంచు దలంచువాని
మాట లేటికి వానికర్మంబులు వ్రాయు
చిత్రగుప్తులు తమలెక్క చెడియె ననుచు
కవిలె పడవేయు దురుధర్మకార్యదుర్య! 156

సీ. శ్రీముష్ణమని దలంచినఁజాలు ప్రాకర్మ
కలితపాపౌఘంబువలనఁ బోవు
శ్రీముష్ణయాత్ర చేసినజాలు నన్యూన
విజ్ఞాన మది శాశ్వ ప్రేళ్ళఁ బెనఁగు

శ్రీముష్ణపురముఁ జూచినఁజాలు భోక్తవ్య
కర్మకాండంబు లెక్కడనొ యడఁగు
శ్రీముష్ణనగరు డాసినఁజాలు కైవల్య
పథమెల్ల కిల్లాకు పంపుసేయు
గీ. తగులుచే నైన శ్రీముష్ణధామసీమ
కాపురం బున్న వానిభాగ్యంబుఁ బొగడ
నలవియే బ్రహ్మకైన బల్చిలువకైన
తలఁచినంతనె మైగరుపొలిచె జూఁడు! 157

గీ. ఇతరపుణ్యస్థలంబుల నెందుఁజూడ
దారమును దెల్పి కరుణించువారు లేరు
కాశి శ్రీముష్ణమున రమాకాంతు నాజ్ఞ
హరుఁడు గరుడుండు నుపవిష్టు లగుదురయ్య! 158

సీ. జనకేళిరతవిరజానదీజలజాత
కులసౌరభము గుబుల్కొన గడంగి
పుడుకచెట్టుల తేనె దడిసిన నునుతెక్క
సురటిజల్లినగొట్టుసోఁక విసరి
హరిపదంబులు దార్ప నర్హమౌ కంటికి
దంబుపై నుత్తమాంగంబుఁ జేర్చి
వైకుంఠపురసురావళి బరాబరిసేయు
మృదులహస్తమున నెమ్మేను నిమిరి
గీ. ఖగకులేంద్రుండు దక్షిణకర్ణమునను
తారకబ్రహ్మపరమమంత్రంబు నొడువు
గడగి కడపటిపయనంబుఁ గాంచువాని
కోమహామహ శ్రీముష్ణగ్రామసీమ. 159

సీ. ఎందుండివచ్చునో యినకోటినిభచక్ర
మరుదెంచు దక్షిణహస్తమునకు
సముయమహా బెఱుఁగునో ఘుమఘుమధ్వనిశంఖ
మపు డొద్దు వామకరాగ్రసీమ
రెవ్వరు పనుతురో యలహేమచేలంబు
జగనీటుగను కటీచక్రసీమ
తరి వేచియుండునో తతమణీకోటిక
మవతీర్ణమగు నుత్తమాంగమునకు
గీ. పతగరాజోక్తతారకబ్రహ్మమంత్ర
మంత్రములు కొన్ని వీనులవల నటింప
తనువుతో బొందు సడలించు ధన్యమతికి
భూసురోత్తమ శ్రీముష్ణపురమునందు. 16(

శా. శ్రీముష్ణంబు సమస్తవైష్ణవమహాక్షేత్రాళికిఁ రాజసే
వామంత్రంబున పాపలోపకరణవ్యాపారపారీణమై
యామోదం బొదవించు నిచ్చుబలదీర్ఘాయుంగళావైభవం
బేమో యంచు మదిందలంచెదవుసుమ్మీ మంత్రిరాణ్ణందనా.

వ. విశేషించియుఁ బంచమహాపాతకంబులసైన్యంబ పటాపంచలం
బుగావించుసమయం బొక్కటి గలదు. అది పరమ రహస్యం
బిత్తఱిం బశ్చాత్తాపమునం జీకాకుపడు నీకుఁ దెలుపందగు
నిం దెవ్వరు లేరుగదా! దగ్గఱకు రమ్ము! కృతాఖిలజనో
ల్లాసంబగు మాఘమాసంబున, నక్షీణపుణ్యలక్ష్మీవిధానపక్షం
బగు శుక్లపక్షంబున, దుర్దమదురితమర్దనఘనంబగు చతుర్దశీ
దినంబున, శ్రీముష్ణంబున, నిత్యకృత్యంబులు నిర్వర్తించి,
రథోత్సవోత్సాహుండగు వరాహదేవునిభజియించి. యవ

భృదస్నానకుతూహలుండగు నద్దేవుని వెంటనె ప్రాగంబు నిదానంబున కరిగి, వేఁగిన ప్రన్నమనాఁడు, ప్రాతఃకాలంబున తదంబుల గ్రుంకి, మధ్యాహ్నంబునకు, చకచకితగోపురమణి డంబరంబగు పురంబునకుఁ జని, సంజనితకంజాతవిహారమాణ రథాంగవధూవిభ్రమశ్రీకరంబగు నభ్రసరోజాకరంబునమును కలిడి, తనుకలితకనకవసనరుచినిచయప్రకాశితదిశాబృందుం డగు గోవిందదేవుని సందర్శించి, విజ్ఞానసభాభాసమానుం డగు నీశానునకు నమస్కారంబు గావించి, యేతెంచి, దినాంతరంబున, సదావాసితగంగానిర్ఝరిణియగు నిత్య పుష్కరిణి నవగాహంబు గావించి, నిశాముఖంబున వరాహ దేవుని సేవించి, తత్ప్రసాదంబును భుజియించినవారికి, దేశాం తరనివాళియైన, దుష్కృతక్లేశలేశంబులు లేక, యనేకా భీష్టంబులు చేకూరు; నావెనుక కైవల్యంబునకుం గాణా చికాండ్లగు. దైవయోగంబున నమ్మాఘమాసం బాసన్నమై యున్నయది. ఏను దదభ్రితాచరణంబున కఱుగుచున్నవాఁడ నచ్చుటికి వచ్చితిరేని రమ్మని పలికిన యమ్మహీసురపుంగవునిం గనుంగొని యభంగురసంతోషాంతరంగుండై గుణశాలి యిట్లనియె. 162.

మ. మును నీతావకపాదపద్మవినుతిం బూతాత్మతం జెందినాఁ
డనొ నీసత్కరుణాగుణంబు కొనియాడం శక్యమే నాయశం
బునకుౕ విస్మృతిదెల్పితే దయవెసం బూర్ణంబుగాఁ దెల్పి దో
కొని పొమ్మచ్చటి కేనువత్తు నిక నీకుౕ శిష్యశిష్యుండనై.

సీ. చక్కఁగాఁ బోనున్న సంయమునీపురం
బున కేఁగుత్రోవల ముండ్లుగొట్టి

చలపట్టి దురితావళులె ప్రాయుచిత్రగు
ప్తులలెక్క హంసపాదులు ఘటించి
మున్నుగా నమరించి యున్నదండనదాడి
యాతనసాధనం బవల ద్రోచి
దండనోత్సుకవృత్తి దరిజేసియున్నట్టి
పాశకోశము పటాపంచఁజేసి

గీ. నన్ను రక్షింప వచ్చి తెంతటిమహాను
భావుండవోగాని యిది యేల సుర్విమీఁద
మిమ్ముఁవంటిమహాత్ములు మెలఁగుటెల్ల
కూర్మి దీనులరక్షించుకొఱకుగాదె? 164

క. అని చిలుక బలుకుచుండఁగ
నినుఁడుఁ బూర్వాద్రిమీఁద నెక్కుట గనుచున్
జనిరియు ప్రభావతి నిద్రా
ఘనపరవశనిమీలితాక్షికై రవి యగుచున్. 165

గీ. చారుకేళీనిశాంతంబుఁ జేరి నాఁటి
రేయి రాజిల్లు రౌతు గారించి రాజు
వలపుతో వచ్చు నా ప్రభావతినిఁ జూచి
"క్షేమనోభీష్టమస్తు"ని తేనెలొలుక
బలికె తక్కటికథవిన జిలుక యపుడు. 166

ఏఁబదిమూఁడవకథ.

వ. అని యిట్లు గుణశాలి సన్నుతించి నీవెంటవత్తు ననిన. 167

చ. అనిన నతండు వేకొనకరాబ్జగృహీతతదీయపాణియై
జనభయకారిఘోరవనశై వలిసీపురపక్కణంబులె

ల్లను గనుపించికొంచు నచలత్వరమించఁగఁబోయిపోయి నూ
తన తరహర్షగద్గదవిధంబున నాతనిఁ జూచి యిట్లనెన్. 168

క. చెంగట గంటివె దక్షిణ
గంగాద్వారము గిరీంద్రకన్యాసదయా
పాంగ త్రిలోకము కాముక
శృంగారమధ్యమై బుధివింధ్యంబున్.(?) 169

మ. తనరఁగంటిరె వృద్ధశైల మిదిగాదా! కంతువిద్వేషికే
తనమౌ దక్షిణకాశి ముష్ణపురభూదారేశ వాత్సల్యసం
జనితానందత నిచ్చటఁ శివుఁడు లాస్యప్రౌఢి గన్పించు నీ
తని సేవించకయున్న తన్నగరియాత్రాసిద్ధిలే దేరికిన్. 170

క. మీరు చతుశ్శృంగములప్ర
కారమున గయాప్రయాగకాశీగంగా
ద్వారము లచ్చట నొక్కొక
వారణమునవచ్చి నిల్చె వరవినయనిధీ 171

మ. అని విన్పించి యతండు దాను వెస వృద్ధాప్రస్థలింజేరి తే
ల్ప నశక్యంబగుసంతసంబు వొడమఁ బాతాళగంగానదిఁ
దనుపుల్ ద్రోచి తదగ్రగర్భగృహవాస్తవ్యుఁ సురస్తవ్యుశ
ర్వుని సేవించి నుతించి వెల్వడిమనోరమ్యోక్తులై పోవుచున్.

క. ధీనిధి హరిశర్మమహా
జ్ఞానుఁ గుణశాలిం జూచి సరసం గంటే
యానందభవన మనియెడి
కానన మిది బరగు ఝుల్లికావన మనఁగన్. 173

మ. సకలర్తుస్ఫుటమానసత్ఫలసమాజం బివ్వనం బర్కర
శ్మికిజోటీయమి మధ్యపక్కణజనశ్రేణుల్ తటాకోత్కరా

బ్జకులంబుల్ ముకుళించుటన్ విరియుటన్ జేయున్ ప్ర
క్రియా, నికరాదాయపరాయణంబులను వింటే! క
రాణ్ణందనా!

సీ. వనరాశి యని డాగవచ్చినమైనాక
ధరముకై వడి గజోత్కరము దనర
నతులసాలసమూహమగు టనంతర చర
త్తురగాళియై మృగస్తోమ మలర
పుండరీకాననంబుగదా యని వసించు
నంచలరీతి సింహములుఁ బొసఁగ
సత్పథత్వం బిచ్చి చలియించుకరిప్రబ్బు
తుటుములగతి కిటిసటలు వెలయ

గీ. కదసి చెలఁగెలతాడోలికావిహారి
సౌరి బాలాంఘ్రిసఖకాంతిచంద్రికాలి
కసితకాసారగంభీరగంధకలిత
పవననవనేయ మానందభవనచయము.

క. ఆనందభవనవని కైన
యానందనవనము నెన్న నర్హంబగునే?
కానం దలపఁగ రాదని
కానందగు సకలఫలనికాయాస్పదమై.

క. ఈవల కృష్ణయు నావల
కావేరియుఁ గొలువఁ బలువగలఁ జెలఁగెడునా
శైవలి నీవల్లభుక్రియ
నీవనతల్లజము గంటివే! విలసిల్లెన్.

క. అదె కంటివె శ్రీముష్ణము
నదెపో యత్కాంతి గోపురాగ్రనిరీక్షా
విదళితదూరాగతజో
విదజనసంసారఘోరవిధతృష్ణంబున్. 178

సీ. ఈవనంబుల వెట్టి యింద్రపట్టణసీమ
  హావణించు నందనం బయ్యె నేమొ ?
యీమేడలప్రమాణ మింతని పద్మజుం
  డమరింప సురశైల మయ్యె నేమొ ?
యీయంగజాలవస్తు లేమైన గిలుబాడ
  యక్షేశునకు నిధు లయ్యె నేమొ ?
యీసరస్థితిఁ జూచి యెవ్వరో యీరీతి
  నడరింప మానసం బయ్యె నేమొ ?
గీ. యీపురముతోడ జోడుగా నెన్నిమారు
లైన గావింప వైకుంఠ మయ్యెనేమొ
నంతపయి లేక నిది సేర నబ్బుటెల్ల
మన మొనర్చినభాగ్యంబు మంత్రితనయ ! 179

క. వీతన్మాత్రమె విభవస
మాతత మిది దక్షిణప్రయాగ యనఁగ వి
ఖ్యాతం బీశ్రీముష్ణం
బీతరి సేవింపఁగలిగె నీశ్వరుకరుణన్. 180

మ. కనుఁగొంటే ఘనమార్గలంబితచణాగ్రస్వర్ణకుంభంబుతో
వనమున్నర్కవిమాన మచ్చటఁ జుమీ వారాహదేహంబుఁ
జెం,దిన నాతండ్రి ముకుందుఁ డాఢ్యుఁడు రమాదేవీసహా

యుండు సజ్జనులఁ బ్రోచుచునున్న వాఁడు కరుణాచాతుర్య
ధుర్యంబుగన్. 181

చ. కనఁబడురంగుబంగరుతగళ్ళధగద్ధగితప్రభానికం
భనమునమించెబావనసమాజముజూచి తెయచ్చటఁ వరా
హానిభజియింపసత్త్వదివిజోత్కరముఁ వసింపఁదన్ని కే
తనముగు మేరుభూధరముఁ తానతదర్థమునిల్చెనోయనన్. 182

ఉ. అన్నియు నారయఁ బహుపురాగతతైర్థికసంకులంబులై
యున్నది వీథు లేమిఁగతమో? యిది మాఘముగాదె?
రేపుగాఁ, బున్నమ నేఁడు సుమ్ము మనపొంత్రిశరీరునకుఁ
రథోత్సవం, బెన్నఁగ నిప్డు పుష్కరణి కేఁగుట యుక్తము
గాదె యుత్తరిన్. 183

క. అనిపలికి యతని దోడ్కొని
చని యాతాయాతవివిధజనసమ్మర్దం
బునకుఁ లోఁగుచు నదిఁ బ
ర్వైన నిర్మల నిత్యపుష్కరిణియుఁ గనియెన్. 184

సీ. దూరాగతాత్మబంధువులు డాశిన వంశ
జేతలవావులు సెప్పువారు
వడయాడుచును భయం బడక నొండొరుకరం
బులు గట్టిగాఁబట్టి నిలుచువారు
చేపట్టు వదలుటఁ జెదరినతమవారిఁ
బేర్కొని బెట్టుగాఁ బిలుచువారు
నితరజనాహ్వానమునకు తన్నామము
లగుటనే నేమేమని యనెడువారు

గీ. స్నానతటగతజన పటాంచలవిగళిత
నీరసంకేతనికటవనీతలమునఁ
గడగి మునివేళ్ళ బట్టుాఁడి నడచువారు
గలిగి తనరారు నిత్యపుష్కరిణికంటె! 185

సీ. పూర్వభాగమున నద్భుతలీలజాహ్నవీ
గోదావరీనదుల్ గొండ్లిసలుప
నగ్నికోణంబున యమునాసరస్వతీ
ఝరిణులు నిండుగాపురముఁజేయ
దక్షిణంబున సముత్కంఠతోనర్మదా
సింధుస్రవంతులు సిరులుగాంచ
నిరుతిదిక్కున నిందితతామ్రపర్ణిక
వేరనదులు వేర్వేరఁ బొసఁగ

గీ. పశ్చిమంబున తుంగయు భద్రయును స
మీరునెడ కృష్ణవేణి కుబేరదిశయు
లాపహాయు, భీమరథియు, హాౕాశ, రపయు
నెలమి భవనాశనియు నిల్వ విది నెలంగు. 186

చ. తటమహీజాతనూతనలతాగళితప్రసవాళితోడి యు
త్కటమకరందబృందములు జాల్చిన యూర్ధ్వవికస్వరాంబురు
ట్పటలముపద్మతోయములు బర్వఁగఁ బుణ్యసరఃకదంబమేకడా
పట నరు దెంచి యిందుమునుగ_వలకొన్న విధంబు దెల్పెదున్.

సీ. ముసుకులతోవచ్చి మునిగెడుఁ శుద్ధాంత
కాంతలకస్తూరికమ్మవలపు
బలుబరాబరులు బోల్పడవచ్చి గ్రుంకు భా
మినుల చొక్కపుఁదట్టుపునుగుతావి

గముఁలుగావచ్చి తానములాడు కర్ణాట
సతులపాటీరంపుసౌరభంబు
హితులతోఁడఁగవచ్చి యాఁదెడిద్రావిడ
పంక్తి మంజలికాపుపరిమళంబు
గీ. తగులుకొని మించుకరుఁగంధములచేత
త్రైర్థికావళి బడలికల్ తలఁగఁజేసి
తనశ్రమాపహనామంబు ధన్యతమము
గాఁబటారించె నిత్యపుష్కరిణి వింతె ! 188

సీ. కమలమకరందరసమధ్యకన్యకాపు
కారము వసించి నిత్యపుష్కరిణిజలము
నడుమనందంబునొందె కుందనపుతగుడు
లంటి దాపిన నవరత్నమంటపంబు. 189

ఉ. ఎవ్వరినని దాల్తు నే నటంచు విహంగ
విభుఁడు చింతించి నావెనక కొదుగు
దోర యెవ్వఁడని బరాబరిసేయుదు నటంచు
సైన్యనాథుండు నిశ్చలతనొందు
నధిపుఁడౌ నతండు రమ్మనిన జేరెదు నంచు
బలవైరి దవ్వుదవ్వులనెవచ్చు
నాయక నిర్ధారణాశక్తి జాలమి
నెత్తమ్మిచూలి నోరెత్తవెఱచు
గీ. నెఱయు నీనిత్యపుష్కరిణీజలమ్ము
మునిగి గ్రక్కున లేచినజనులశంఖ
చక్రపీతాంబరాదిలక్షణవిరాజ
మానవిష్ణుసామీప్యులైనకతన. 190

క. ఈనిత్యపుష్కరిణికిఁ గృ
శానుదెసంగంటె దిగ్గజప్రవరాశా
ధీనత్వశరణచణశా
ఖానీకనిబద్ధమైన యశ్వత్థంబున్. 191

క. ఈ రావిఁ జూడు సాక్షా
న్నారాయణమూర్తిసేవ నామాత్రశ్రీ
పారంపర ప్రియదంబు వి
చారింపఁగ దీనిఁ బొగడ శక్యమె మనకున్. 192

క. అని తెల్పిన తదనంతర
మున నయ్యిరువురును నిత్యపుష్కరిణిఁ గ్రుం
కినవారై కోవెలకుఁ
జని గరుడస్తంభనికటజగతి న్నేఁగన్. 193

క. సాష్టాంగనతులు సేసి ప్ర
హృష్టులజయవిజయుల న్నిరీక్షించి నిజా
భీష్టము లోన గూడఁగఁ జని
యష్టపురాగర్భగృహాభ్యంతరగతులై. 194

సీ. సపవిత్రనందతిత్ప్రిపారితోహ్యాంభోజ
మహితపాదాబ్జు నముద్భిడౌజు
దండకఖండనోద్యద్భూరినిశ్వాసు
కమనీయరుచిరసత్కనకవాసు
శారదచంద్రికాచారుకాంతిశరీరు
నిగమాంతకేళీవనవిహారు
విమలకటీతటీవిన్యస్తమృదుహస్తు
నతభక్తలోకావనప్రశస్తు

సీ. రుచిరవక్షోభిలక్ష్మీ సరోజగేహాలు
ధరణీ సంభరణాసముద్ధరణ దేహాలు
నష్టారాహాలని సేవించి యధికభక్తి
నతుల వాచానిరూఢి సన్నుతు లొనర్చి. 195

ఆ. సుస్మేరంబగు నీముఖాంబురుహ మిట్లుం జూడగల్గెక మనో
భస్మారంబులుఁ జెంద నీయక పురాపర్యాప్తపాపౌఘముల్
భస్మంబై చనఁజేసి భూరికరుణాపారీణతారూఢిమై
యస్మద్ఘోరభవంబు బాపు మిక సర్వాంగీణ పాండుద్యుతుల్.

క. అని వినుతించి రథోత్సవ
మును గన్గొని తద్వ్రితం బమోఘాదృతిచే
సినవారై దమదేశము
జనుచో నిరువురు దినాంతసమయమునందున్. 197

గీ. అనుచు కీరంబుఁ దెల్పఁగా నంతలోన
ప్రాగ్గరాధరశృంగంబుపై సరోజ
బంధుబింబంబు జూచి ప్రభావతీర
మణియు కేళీనిశాంతంబుఁ దనరఁ జేరె. 198

ఉ. చేరి ప్రభావతీసుదతి చెల్వుగ నాఁటిదినాంతవేళ సిం
గారముమీఱ చారుకనకద్యుతు లంగమునందుగల్గ యొం
య్యారముతోడ రాజసమునారయఁబోయెదు నా ప్రభావతీ
సారసగంధిఁజూచి రసచాతురిమీఱశుకం బ దిట్లనెన్. 199

సీ. భళిరె! శెబాసు! యోహావైశ్యపంకజాక్షి!
యింత వేగిరమొంద నీవేఁగుదెంచు
టెనెఱుంగుదు తక్కటియైనకథయు
వినవలె నటంచు వచ్చితి వింతె వినుము. 200

వ. ఇవ్విధంబున నవ్విప్రవరులు మఱలి నిజపురంబున కరుగుదేర నంత సంధ్యాసమయంబున. 201

క. ఒకపల్లెఁ జేరఁ జని యం
తిక నటి తత్కాలవిధులు దీరిచి యొకశూ
ద్రకు నడువాకిటఁ శయనించిరి
శకకృతపురగమనమార్గజనితశ్రములై. 202

గీ. అప్పుడాయింట గేస్తురాలంగవిజితరంభ
రంభచతురిక యనుపేర బ్రబలుమగఁడు
తాను పొరుగూరి కరుగ నితరు బిలిచి
కొని మనోజాతసంక్రీడఁ బెనఁగుచుండ. 203

ఉ. అత్తరివచ్చె తత్పతిధరామరు లిద్దఱు దీనికాళలో
దాత్తతఁజాత మంచు సభయంబుగ నుండిరి లెస్స వింటివా
చిత్తరి యప్పుడాహిమగబింబముఖీమణి బొంకు లెట్లు నీ
యుత్తమచాతురీగుణసమున్నతి నెంచెద దెల్పుమాయనన్.

గీ. అన ప్రభావతి శుకకులాధ్యక్ష! యింత
గనఁగఁగల్గిన నేర్పరిగాను యేను
జాలు నులుకుట్టుమాటలజోలి యేల
నవలికథ దెల్పు మనిన నిట్లనియె చిలుక. 205

క. చతురికపతివచ్చుట గని
వెత గల్పించుకొని క్రూరవృశ్చికదష్టా
స్థితి మాన్పెడుమంత్రజ్ఞుని
గతి మంత్రింపుచు వసింపగా జేసి వెసన్. 206

క. ఇలు దెఱచివచ్చి నిలిచిన
చెలువునిపై ప్రాలి యేమిచెప్పుదు నీవు

ద్దులమోము జూడఁగానక
పాలుబాపుచు నుంటితేలు బుడుకుటకతనన్. 207

ఉ. నాయతిఘోరవేదననినాదములన్ దయవుట్టి వీథిలోఁ
బోయెడునట్టి యీపరమపుణ్యుఁడు గ్రక్కున మంత్రశక్తిచే
నాయువు నిల్పె నీతని మహాద్భుతసద్గుణ మెంచగాఁ దరం
బే యిక నేల బిడ్డఁగని పేరిడఁగావలయున్ మనోహరా!

గీ. పడకఁ దెలువరు బిడ్డలు బాపనయ్య
లదిగొ చావడి బవళించి నిదుర లేక
యన్నియును చూచుచున్న వా రడిగి జూడు
రెన్నిపాటులు పడితినో యింటకు మునుపు. 209

మ. అనినం దత్పతిజారునింబొగడి నాప్రాణంబు రక్షించి తం
చును పైపచ్చడ మిచ్చి వీడ్కొలిపె నచ్చోఁ దద్వధూచాతురీ
జనితాశ్చర్యులు భూసురుల్ నిజనివాసప్రాప్తులై రంచు మె
త్తనివాక్యంబుల చిల్కబల్కు నెడ ప్రాతర్వేళగావచ్చినన్.

సీ. కోమటి మెఱుంగు నిబ్బెపుగుబ్బలాడి
యంతిపురమున కరిగి సాయంత నాస్తి
గాచి గ్రైచేసికొని మహీకాంతు సంగ
మాభిలాషంబుతోఁ జేర నరుగ దేర. 212

క. కనుగొని గుణసారుండో
వనితా జని యెదవె ధరణివల్లభుకడకున్
జను మిక నొకకథగల దది
విను మనుచుం బలుకఁబోడఁగె వేడుకబోడమున్. 211

శా. కావేరీతటి ద్రావిడీనినదశంకాకాళికీ కీచకీ
రావంబై యొకయగ్రహారము రువారం బందు నుద్యల్లస

ద్భావుల్ మిత్రుఁడు దేవదత్తుఁడును విద్యాశాలి యాముష్యుం
డనఁగాఁ, గా విఖ్యాతివహించి భూదివిజలోకశ్రేష్ఠులై నల్గుర
ర్థావేళ స్పృహాతం జరింతురుగ కియ్యత్త్వంబు శూన్యంబు గాన్.

గీ. తద్ధ్రివిణ మెల్లగిలు బాడఁ దలఁచి ధూర్త
విప్రుఁ డొక్కండు వారల వెంటవెంటఁ
దిరిగి తన్నైత్రివడసె విధేయనామ
ధేయుఁ డరివంచనాపరాత్మీయబుద్ధి 214

ఉ. అంతట పాండ్యమండలమునందు ద్రవాఖ్య నెసంగు మేదినీ
కాంతుఁడు భూరిదాన మొసగన్ సమకట్టిన విన్నవారలై
సంతసమంది నల్గురు ద్విజన్ములుఁ గూడి విధేయుతోడ న
త్యంతరయంబుమై నరిగి రాదొరయున్న పురంబు నేరఁగన్.

వ. ఇవ్విధంబునఁ జేరి. 216

సీ. మంత్రీంద్రులకు వేదమంత్రపూర్వాశీర్
భాసురోక్తుల నిమ్మపండ్ల నొసఁగి
యధికారి చెంత వేదాంతభాష్యాదిమీ
మాంసాదిసంవాదమహిమఁ జూపి
హితపురోహితు లున్నయిండ్లకుఁ బసుపుపం
డ్లను గొనిపోయి బంధుతలు నెఱపి
వాకిట గొల్లల కేకతంబున ధర్మ
తత్త్వమార్గమును బోధన మొనర్చి

గీ. యుడిగములవారి కెల్ల మే మున్నవార
మనుచు మంత్రాక్షతల నిచ్చి యనుసరించి
వారు సముఖంబు సేర్ప భూవరుని చేతఁ
గైకొనిరి నాల్గువేల రొక్కంబు వారు. 217

గీ. ఇట్లు గైకొని తమయూరి కేఁగఁదలచి
త్రోవ నరిగొట్టి దొంగలు ద్రోచికొనుట
వింత మరిగొనిపోవ సువేళగామి
హితుఁ డనెడిపేర నొకబచ్చుయింటి కరిగి. 218

క. ఈయెనిమిదిజాల్లధన
మీయెడ మీయింట నుండనిమ్ము పురంబుం
డాయఁగఁ జని నేగనుగొని
పోయెద మిటువచ్చి యనుచుఁ బొసగించి వెసన్. 219

గీ. ఇప్పుడు వచ్చిన యేగురునిందువచ్చి
యడుగునప్పుడుగాని యీయర్థ మొసఁగ
వలదనుచు రొక్కము బచ్చువానిచేతి
కిచ్చి వానిల్లు వెలువడి యావలి కరిగి. 220

గీ. కొలువుబత్యంబునకు లేక యరుగఁదరమె
యనుచు మిత్రాదులగునల్గు రాత్మఁదలఁచి
యలవిధేయుని బిలిచి నాల్గైదుమాడ
లడిగి తెమ్మని యడుగఁగా నతఁడు వోయి. 221

క. హితుఁజేరి రొక్కమంతయు
నతిరయమునఁ దెమ్మటంచు ననిపిరి మావా
రతులితశూరసహాయులు
జతగూడిరి పయనమునకుఁ జనియెద మనినన్. 222

గీ. అతఁడు గేహంబువెడలి యయ్యవనిసురుల
నందఱిని జూచి యిత్తున యనుచు నడిగి
వార లిమ్మని పలుక నివాసమునకు
నరిగి యాతనిచేతికి నర్థ మొసఁగె. 223

ఉ. ఇచ్చుటయున్ విధేయుఁడు మదీప్సితముల్ ఫలియించె నం
చు లో, హెచ్చినసంభ్రమంబురల నెప్పటినల్గురిఁగూడి కొంత
ద,వ్వొచ్చెడురీతి వెంటఁజని యంతట వారల కన్మొఱంగి తా,
నిచ్చకువచ్చుతావునకు నేఁగె మహాజవ ముప్పతిల్లగన్. 224

ఉ. అంతట వానిగానక పు డంపిననాలుగువేలరొక్క మా
దృంతము దెచ్చెనో జరిగెనోయని మిత్రముఖుల్ దలంచి య
త్యంతరయంబునన్ మఱలి యాహితునింటికిఁబోయి మాధనం
బంతయు నిమ్మటన్న విని యాతఁడు వారలఁ జూచి నవ్వుచున్.

గీ. అపుడు మీరంపఁగా వచ్చినట్టియతని
చేతికేమిఱ లిమ్మని సెలవొసంగ
ధన మొసంగుట యెఱుఁగనిదారిబలుక
దగునె యీసుద్దు లెల్లవర్తకులతోడ. 226

గీ. అనినవారు రొక్కమంతయుఁ దెమ్మని
యనుప లేదనంగ నతఁడు మీర
లిమ్మనంగ విత్త మిచ్చితినో లేదో
యనఁగ పెద్దమాట లయ్యె నపుడు. 227

వ. తదీయవాక్యోపవాక్యంబు లాకర్ణించి యందంద సందడిగా
మూఁగినయాధార్మికులు గొంద ఱిఱుదెఱంగులవారి వారించి
మహీసురోత్తములు విత్తంబంతయుఁబోనాడుకొని పోదురె
యనియును, హితుండు ఘంటికామంత్రంబు తనయింట
నునుచికొనుట కాని లాభంబుగానని వాఁ డర్థంబంతయు
నిచ్చునే యనియుం దలపోసిచెడినసొమ్ముచెరిసగంబుగా వగ
దెంచి యాబచ్చువానిం బిలిచి వీరు నీయధీనంబు బెట్టిన
ధనంబునం దొక్కపాలిమ్మనిన సమ్మతించక యతండు నలువురిం

దోడ్కొని పాండ్యమహీమండలాఖండలు సముఖంబునకు నరిగె. రోప్రభావతీ! యవ్వసుమతీపతియేగతి తదీయవి వాదం బుడుపవలయు నిది యొఱుంగకున్న నన్యసామా న్యండగు రాజన్యమూర్ధన్యపాలికింబోవ నూహింతువే తెలుపు మని పలికిన యంకురితమనఃస్సంకోచన యగునప్పంక జాక్షి నీరీక్షించి యప్పక్షికులాధ్యక్షుం డిట్లనియె. 228

క. మగువా! తిర్యక్కులజుం
డగుట స్మృతి లేక మించనాడితి నేరం
బగు సైరించుట భవదీ
యగుణంబుగదా శమించి యవ్వలవినుమా! 229

క. ఆపాండ్యనృపతి విప్రా
లాపంబులు హితునిమాటలుఁ విని నరుగఁ
ప్రాపితముఖుఁడై కరుణా
శ్రీపటిమఁ బచ్చువాని చేరఁ బిలిచెన్. 230

క. పిలిచి చెవులోన నేమో
పలికిన నతం డలరుమొగము భాసిల్లగ రా
జులదేవ యనుచు ధరణీ
తలనాయకుఁ బొగడి జనిత దరహాసమునన్. 231

గీ. బ్రాహ్మణులఁ బిలచి నాయింటఁ బదిలపరచి
యున్నయది విత్తమెల్ల నాయొద్ద ననుచు
నపుడు మీఁచిన్నగతి నేఁగురరుగుదెంచి
యడుగఁ డిచ్చెద మాఱుమాటాడవలదు. 232

క. అన వారు మొగమొగంబులు
కనుగొనుచు న్నిలువ ధరణి కాంతుఁడు కరుణా

వననిధిగాఁ గాపునవారల
ననిచెన్ బహుధన మొసంగి యంభోజముఖి. 233

క. ఆరాజవరునకుఁగల
నేరుపు నీకబ్బెనేని నృపలోకమణిన్
జేరుమని చిలుక యనునెడ
వారిజహితుఁ డెక్కెఁ బూర్వవసుధాధరమున్. 234

క. అపుడు ప్రభావతి తనయం
తిపురమునకు నరిగి తమ్మితెగ నెవ్వగలన్
తపియించువేళ వచ్చిన
నపరిమితానందమానసాంభోరుహయై. 235

శా. పన్నీటం జలకంబులాడి తొగలుం బాలాభిరేఖావళీ
చిన్నెల్ వ్రాసినచీరగట్టి యపరంజింజిమ్ము నెమ్మేనిపై
మిన్నుల్ గ్రమ్మెడి సొమ్ముదాల్చి మహిభృన్మీనాంకజన్యక్రియా
సన్నద్ధత్వమునొంది యందము రహించన్ జార నేతెంచినన్.

చ. కనుఁగొని పచ్చ రెక్కఁ పసగల్గిన పుల్గులరాయఁడో కన
త్కనకఘటాఘటాచకచకత్తనువల్లిక నేఁడు దెల్పు నీ
యనుమతివిఁనాఁదగాని కథయంచు దలంకుచు విన్న వింతునా
యనితదుదారకౌతుకకటాక్షసిరీఘలు గాంచి యిట్లనున్. 237

ఉ. అంగవసుంధరాభరణమై యొకపట్టణ మంద మొందు మా
తంగతురంగసద్భటకదంబళతాంగతతుల్ సెలంగఁగా
మాంగళికాభిధాన మసమానముగా వహియించి యప్పురం
బంగదనామధేయ వసుధాదిపుఁ డేలను తేలుసంపదన్. 238

ఉ. ఆనరపాలమౌళికి వరాంగముకైవడి నొక్కమంత్రిమే
ధానిధినాముఁడై తగునతఁడు నిజాంగనజాయమానక్షో

భానుతశాంతవేరి యొకబాలికెగాంచి దివంబునెంద సం
తానముఁగోరి లోలయనుత న్వివరించి రమించె నంతటన్.

ఉ. ఆలలితాంగికంటికి ప్రియంబగుసొమ్ముధరించి సేవక
శ్రీలమెఱింగి జిహ్వకు రుచించుపదార్థము లాహరింప నే
వేళ ప్రసూనతల్పమున వేడుకమై బవళింపుగల్గుటఁ
చాల ముదించి జారజనసంగతికై తివురుబ్బిగల్వగాన్. 240

సీ. రేయిదాల్చినవిరుల్ ప్రేలుఁగొప్పున జాఱ
నగుమోము జిగిమించనదికి నరుగు
పుక్కిటివీడె ముబ్బురపునీటుఘటింప
కులుకు నెన్నడలతోఁ గుడికి నరుగు
పయ్యెద వీడ గుబ్బలనిగ్గు గనుపట్ట
నెమ్మితోఁ జొట్టము లిండ్లకరుగు
పావడపై వ్రాఁతపని జీర రాణింప
కొమరుతోఁ వనభోజనముల కరుగు

తే. నరుగుచోఁ మంచిమగవాఁ డెదురనుపడగ
వనిత తగవాని నటు బిగాబగలఁజూచు
సొగకడకంటి నెఱవాఁడి సొలపుఁదళుకు
బెళుకుచూపుల నయ్యిందుబింబవదన. 241

తే. ఇంట నేతెంచుచుట్టంపు టెమ్మకాండ్ర
తరచుగాఁ బిల్చి తేరద్రస్తరులు బలికి
తన్మనంబులరాగకందళము లునిచి
యతిభయాతతమున వాఁడ నడలుపడలి. 242

సీ. దూతికపట్ల నెంతో మైత్రి వాటించి
దానికి మన సిచ్చి తగులు నెఱపి

సఖియొడాటమున నిచ్చకముగా వర్తించి
ధాత్రియుఁగూడి మంతనములాడి
ప్రాతివేశిని దనప్రాణంబుగాఁ జూచి
లెంకలతోడ మాలిమి యొనర్చి
శిల్పినీరుదికి మచ్చికబుట్ట నడపించి
తనకు దా సాహాయ్యమును భజించి
గీ. యత్తికామాతులసుతాదులైనబంధు
గంధసింధురగమనల గారవించి
యేయుపాయంబులను గోర్కె యొనయనేని
తన మహాంతఃపురాధివాసనకుఁ గనలు. 243

సీ. తనివిఁదీఱఁగ నందతనయుతో రతికేళిఁ
బెనఁగిన గొల్లగుబ్బెతలమనువు
చంద్రునంతటి నిండుజాణకౌఁగిటఁ జొక్కి
తమిఁగడఁదేర్చిన తారబ్రతుకు
నేమగమిని యైనదేవేంద్రు నన్యునిగూడి
కాంతుఁజెందు నహల్యకాపురంబు
శివుగూడి తనివిఁగాంచినయట్టి దారుకా
వనమౌనికాంతలవర్తనంబు
గీ. మెచ్చుగాక మతేమి యీమేనియందు
యనుభవించనిసౌఖ్య మే లనుచు వనిత
యింటిలోనుండి చావడి నెవ్వరైన
సరసరీతిప్రబంధముల్ చదివిరేని. 244

ఉ. ఏపురతోడఁగూడి రమియించగ భాగ్యముఁజేసెఁ గావునన్
ద్రౌపది మెచ్చవచ్చునని తొయ్యలి సంతసమొందునంతలో

సావిభుఁ డామృగాక్షికి నిజాధిపుతోడసుఖంబుగల్ల ది
చ్చావిధిఁజేయుజారజనసంగతిగాకని యెంచు నిచ్చలున్. 245

గీ. ఇవ్విధంబున నప్పూర్ణి మేందువదన
యన్యసంభోగసుఖలేశ మబ్బ నేని
యాఁకసంబైన ఛేదించి యవలబోవు
నంతకుఁ దెగించియున్న యయ్యవసరమున. 246

క. వారింటి దేవపూజా
కారిత్వము బూని వేదఖనిమై వినుతా
చారుండై సుగుణనిధీ
చారణుఁడన నొక్క బ్రహ్మచారి చెలంగున్. 247

గీ. గున్న యేనుంగు మదరేఖగూడినట్లు
తావితూఁమని కెనసి దారి ధవళ
కరుఁడు పదియాఱుకళలతోఁ గదియుకరణి
వాఁడు సానాట నిండుజవ్వనముఁ గాంచె. 248

గీ. అపుడు జారగవేషణాయత్తమైన
లోలహృదయంబు వానియుద్వేలకాంతి
కవయవో లక్ష్యదేహంబు గాంచి నిలిచి
త్రిమ్మటలు బట్టు బడలికల్ దీర్చుకొనియె. 249

సీ. మునుపటివలె నుండజనదుగా యికనొక్క
చెలి బెండ్లియాఁడంగవలదె యనుచు
నితని కిత్తరి బెండ్లి యేటికి యింకభో
గముచెల్వ లున్నారుగద యటంచు
పఱచు లేవారిచిత్తరముభావించి చూ
డగ క్రొత్తకోడెకాఁ డౌట యనుచు

వెలివనేటికి నట్టి విద్యలచవిరొయలుం
గఁడుగాని చోరబారఁగలఁ డటంచు
గీ. నొంటిపాటునఁ బలికి యాఁయువిదయమ్మ
చెల్ల యీమాట లెవ్వరిచెవులఁబడెనొ
యనుచు నాలుగుదిక్కులు నరిసిఁ జేరి
వాని నెమ్మది నొకవింతవలపు నెలిపు. 250

క. ఈరీతి నవ్వధూమణి
చారణు లోఁబఱచి యొకనిశావేళ తమః
పూరితమగు నొకయింటఁ
జేరిచికొని యిష్టకార్యసిద్ధింగొనియెన్. 251

క. కని యదిమొదలుగఁ దద్ర
త్యనుపమసౌఖ్యాబ్ధినోలలాడుచు మరునిం
దనబంటుగాఁ దలంపుచు
ఘనతరగర్భమున కన్నుఁగానక మెలఁగెన్. 252

క. అంతట బాలామణియగు
శాంతం బోషింప మఱచి చారణనిమగ్న
స్వాంతత్వముజెందినత
త్కాంతామణి నడకలెల్ల గాంచిన యదియై. 253

గీ. శాంతయును బాలయయ్యునుఁ జతుర యగుట
దీనికి భయంబుఁజూపినగాని తనకుఁ
బోషణముచేయ దిది యని బుద్ధిఁ దలఁచి
యోర్చికొనియుండి యంతట నొక్కనాఁడు. 254

చ. జనకునిఁ జేరి యాతనికి సంతసమయ్యెడు మాటలాడి, సొం
పెసఁయగ నీవుగాక మరి యెవ్వఁడొకతండ్రిగలఁడు నాకుఁ బో

మ్మని పలుక న్వినిశ్చలత రాద్భుతుఁడై మదిఁజెంది సందియం
బునఁ దలపోసి యాసచివపుంగవు డెంతయు నాదరింపుచున్.

గీ. ఇంక నొకతండ్రిగల దంటి విందువదన
యతనిఁ జూపెదవే యన్న నవ్వధూటి
మంచి దీరేయి జూపెద నంచు బలికి
యవలి కరిగిన యమ్మాట లాలకించి. 256

క. ఆలోలాంగన తనదగు
శీలం బిది యెఱిఁగి పతికిఁ జెప్పగఁ బూనెం
బోలు నని తలచి మిక్కిలి
జాలింబడి కాంతఁ బిలిచి సత్ప్రియరీతిన్. 257

గీ. అనునయించిన నబ్బాల యైననేమి
నన్నుబోషించెదేని యంతయును మఱపుఁ
దాల్తు ననిపల్కె నింక నత్తరుణి జనక
భావసంశయ మెట్లు బాపంగవలయు. 258

క. అనిపలికి యూరకుండిన
కనుఁగొని యా రవ్యజలజగంధియు ఘనచిం
తొసరించి తెలియఁజాలక
వినుపింపు మటన్న కీరవిభుఁ డిట్లనియెన్. 259

వ. అంత నిశీథినీసమయం బగుటయు, నమ్మేధానిధివిభావధీరత
తమఃపుంజంబగు కేళిమందిరంబున లోలాసమేతుండై యుండి
యబ్బాలికం బిలచి ద్వితీయజనకుం జూపుమనిన నాకాంత
యత్యంతమౌగ్ధ్యంబు దాల్చి తదీయ చ్ఛాయ జూపిన
నతండు నవ్విలోలం జూచి యేతద్బాలికాలాపంబులకు
నీయందు సందియంబుఁ జెందితి నని తద్వృత్తాంతం బంతయుం

దెలిపి పతివ్రతాశిరోమణియగు నీ కిట్టిగుణంబులు పుట్టునే యని బహూకరించెం గావున నయ్యమాత్యకుమారికకుం గలయగణ్యనైపుణంబు గలిగినంగాని ధరణి భుజంగుని సంగతికిం జనగూడునే యనునంతలో నరుణోదయంబైన ప్రభావతీలలితాంగి శుద్ధాంతంబున కరిగి క్రమంబున దినావసానం బగుటయు. 260

చ. జలకములాడి జీని బురుసాజిగిచీరె ధరించి గుబ్బలన్
గలప మలంది కన్నుగవ కాటుక రేఖ యమర్చి కస్తురిన్
తిలకము దీర్చి భూషలును దేహమునందు నలంకరింపుచున్
కలవలరాజుఁబోలు నరనాథుని జేరగ నేఁగు నత్తరిన్. 261

క. చని నాఁటిరేయి నరపతి
నెనయన్ దద్గేహసీమ నేఁగెడుదానిన్
కనుగొని యనియెన్ గీరం
బులు దనపల్కులను నమృతముం గులుకంగన్. 262

— ముప్పదితొమ్మిదవకథ —

క. కలహవిజృంభణబాహా
బలనిర్జితశత్రురాజబలుఁ డతిలోకో
జ్జ్వలచిత్రసేనుఁ డప్పురి
చెలువొందగ నేలు చిత్రసేనుం డనఁగన్. 263

గీ. అతఁడు నాతనిదేవేరి నతులదివ్య
లక్షణాకృతి నయ్యాదిలక్ష్మిఁబోలి
వెలయు సుబలాంగనయు సముద్వేలలీల
నేకకంఠత నిద్రాత్రియేలుటయును. 264

మ్మని పలుక న్వినిశ్చలత రాద్భుతుఁడై మదిఁ జెందు సందియం
బునఁ దలపోసి యాసచివపుంగవు డెంతయు నాదరింపుచున్.

గీ. ఇంక నొకతండ్రి గల దంటి విందువదన
యతనిఁ జూపెదవే యన్న నవ్వధూటి
మంచి దీరేయి జూపెద నంచు బలికి
యవలి కరిగిన యమ్మాట లాలకించి. 256

క. ఆలోలాంగన తనదగు
శీలం బిది యొఱిఁగి పతికిఁ జెప్పగఁ బూనెఁ
బోలు నని తలచి మిక్కిలి
జాలింబడి కాంతఁ బిలిచి సత్ప్రియరీతిన్. 257

గీ. అనునయించిన నబ్బాల యైన నేమి
నన్ను బోషించెదేని యంతయును మఱపుఁ
దాల్తు ననిపల్కె నింక నత్తరుణి జనక
భావసంశయ మెట్లు బాపంగవలయు. 258

క. అనిపలికి యూరకుండిన
కనుఁగొని యా రవ్యజలజగంధియు ఘనచిం
తో సరించి తెలియఁజాలక
వినుపింపు మటన్న కీరవిభుఁ డిట్లనియెన్. 259

వ. అంత నిశీథినీసమయం బగుటయు, నమ్మేధానిధివిభావధీరత తమఃపుంజంబగు కేళిమందిరంబున లోలాసమేతుండై యుండి యబ్బాలికం బిలచి ద్వితీయ జనకుం జూపుమనిన నాకాంత యత్యంతమౌగ్ధ్యంబు దాల్చి తదీయ చ్ఛాయ జూపిన నతండు నవ్విలోలం జూచి యేతద్బాలికాలాపంబులకు నీయందు సందియంబుఁ జెందితి నని తద్వృత్తాంతం బంతయుం

చ. ఇలగలపుణ్యతీర్థముల కేఁగి వ్రతంబు లొనర్పుతీర్థవా
సులకు సమస్తవస్తువులు చూఱ లొసంగ కుటుంబభోజనం
బులు ఫలదానముల్ నడపుభూసురకోటికి ప్రాక్తనంబుతా
కొలలు హరింప నక్కుసుమకోమలినాథు ననుజ్ఞ మున్న గన్.

వ. ఇత్తెఱంగున సుపుత్రోదయకారణంబులగు బహువిధశుభ
వ్రతంబు లాచరింపుచున్నయెడ నొకనిశీథినీసమయంబున.

గీ. పతియు దానును సురతానుభవమువలన
అంగమునబుట్టు బడలిక లపనయింప
మృదులతరతల్పనమునబొంది నిదుర జెంది
మేలుకల గాంచి యంతలో మేలుకాంచి. 270

క. తనప్రాణవల్లభునకుఁ
గనకలతాతన్వి గనినకలతనవాలుం
గనుఁగొనలసిగ్గుఁగుల్కుచు
వినుపించిన యవ్విభుండు విస్మయమతియై. 271

క. ఇక్కల నిక్కను యగుచుఁ
జెక్కులుగలజక్కి నెక్కురేఖావంతుఁ
జిక్కపరచు నవమోహము
నొక్కరునిఁ గొమరు గాంచెదో యొలనాఁగా! 272

గీ. అనిన మో మరవాంచి బింబాధరమున
గందళించిన చిఱునగ వొందగించ
నేమమునగాను నోచిననోము లెల్ల
పండెనేమోకదా యని యుండునంత. 273

గీ. చిత్రసేనపతక్షీంద్రుతో శితమునీంద్ర
శాపసంప్రాప్తుఁడైన వైశ్వానరుండు

జగతి నిక రాజవంశాబ్ధిచంద్రుఁ డగుచు
టంచు దైవజ్ఞు లెఱిఁగింప నాక్షణంబ. 274

క. ధీరులు దెలుపఁగ మది చెలు
వారం దగు సుబలతోడ నతులితసదన
ప్రారంభవేళ నపుడుల్
గోరి ప్రసన్నునిగఁ జేసికొని వినయోక్తిన్. 275

క. తనయాభిలాష దెల్పుచు
మనమలరన్ వేఁడుకొనినమాత్రనె యతఁడే
నెనయభవద్గర్భంబునఁ
జని యిత్తు నటంచు వర మొసఁగి చనునంతన్. 276

వ. అది కారణంబున. 277

క. కలవాణీమణి సుబలకు
నెలమసలినపిదప రెండునెలలై మఱియున్
నెల యొండుగడచినంతన్
చెలువకు నెమ్మేనగర్భచిహ్నోదయమై. 278

చ. వెలవెలనైననెమ్మొగము వృత్తగురుస్తనగోరకాగ్రముల్
నలుపువహించె నిమ్నతరనాభిబయల్పడియెన్ వళీతరంగరే
ఖలనగుముత్యముల్ దొలఁగె కౌనొకయించుకగాఁగనాభ
యాం, కలుతరచయ్యె నవ్వికచకంబు దళాయతనేత్ర కెంత
యున్. 279

క. ఈరీతి న్నవమాసము
లారామామణిధరించి యతులితసుముహూ
ర్తారంభవేళగనెసుకు
మారున్ సుకుమారతనురమాసుకుమారున్. 280

వ. అట్టియెడ. 281

సీ. అనవద్యవాద్యములనగర చేటిక
నగరసామంతు లనంగ నడిచె
బ్రతికెద మని కోరి మతి నుల్లసిలు విప్ర
వరులకు బంగారువానగురిసె
పట్టణశ్రోణినాబాలవృద్ధాదులౌ
ప్రజలకుఁ జక్కెఱపంటఁబండె
గడిదుర్గములనుండి కడుచూడఁజాలని
యరివీరులకుగుండె లావలించె

గీ. నెంచఁదగియున్న వియ్యంపుటింటిరాచ
కులము మన్నీల కింతైన బలిమిగలిగె
శోపనారత్నమగుసుబలాపురంధ్రి
కడుపునను పుత్రతిలకంబుఁ బొడమె నపుడు. 282

గీ. అంత నారాజవరుఁడు శుద్ధాత్ముఁ డగుచు
వసుధ మెచ్చంగ పుత్రోత్సవం బొనర్చి
ప్రోడలగుభామినీమణుల్ పురుడుదీర్చ
జాతకర్మాధికృత్యముల్ సంఘటించి. 283

క. పేరొసఁగె చిత్రభానుమ
హారాజనగురు నసుజ్ఞ నలబాలునకుఁ
పేరుకలహంసగమనల
వారతరతనాలతొట్లు నలరించె వెసన్. 284

ఉ. సొన్నపుసన్నపుంబనుల చొక్కటపమా దగతొట్ల వ్రాఁచి నా
యన్నకులాలి నన్ను గని నయ్యకులాలిసిరుల్ దొలంకువాల్

గన్నులబుచ్చిపాపనికి లాలి మరందము గ్రమ్మరించు విల్
గన్నవజీరుగన్నవగకానికి లాలి యటంచు భామినుల్. 285

గీ. మొదమొదవ బాలుఁ డిట్టు లభ్యుదయలీలఁ
బెరిగె నానాఁటివిదియచందురునిబోలి
వినయగాంభీర్యధైర్యవివేకముఖ్య
సరసగుణముల నానాఁటఁ బెరుగుచుండ. 286

సీ. అభ్యసించె చతుర్విధామ్నాయబహువిధ
కావ్యనాటకాది గ్రంథములును
సాధించె ఖురళికాస్థలిని ముప్పదిరెండు
నాణెంబులైన విన్నాణములను
వాయించె వల్లకీవాదనాదసమస్త
సంగీతబహురహస్యక్రమములు
నేర్చె మదోద్ధతానేకప జవతురం
గమరథారోహచంక్రమనిరూఢి

గీ. తెలిసె సామాద్యుపాయశక్తిత్రయములు
కనియె రాజన్యనీతి ప్రకాశనీతి
రాజమాత్రుండె యమ్మహారాజతీవ్ర
భానుమద్ద్యుతి యాచిత్రభానునృపతి. 287

వ. ఇవ్విధంబున నవ్వసుంధరావరకుమారకంఠీరవుండు నిరవధిక
భోగభాగ్యోదయుండును, నిరుపమానమహైశ్వర్యధుర్యుం
డును నిరవద్యసకలవిద్యాప్రవీణుండును నై యుండునంత.

క. కుందనమును నెత్తావియు

యిందుముఖికందర్పున
కందంబుగ యౌవనోదయ మ్మెదిరించెన్. 289

గీ. అంత తలిదండ్రు లత్యంతహర్ష మెసఁగ
మంచికళ్యాణవేళ సన్మానలీల
పంచకళ్యాణ మొనరించి పట్టభద్రుఁ
జేయ జగతీసురేంద్రుఁడై చెలగుటయును. 290

క. ముయ్యాడుముద్దుగుమ్మలు
వెయ్యార్వురులుగల రయారె వీరినగరినో
తొయ్యలి వీరందఱిలో
నెయ్యము మదిఁ దొంగలింప నీవై ప్రేమన్. 291

గీ. తొడరి నినువిన్న యదిమొదల్ కడువిరాళి
నితఁడు మకరాంకశరశతక్షతశరీరుఁ
డయ్యె నీచేతిదింక నే యంచు బల్కు
సెలవుల నొకింత చిఱునవ్వు చెంగలింప. 292

క. తలవాంచి సమ్మతం బగు
తలఁపున నుండునెడ నుదయ ధరణీధర ది
క్తలమున రవి యుదయించిన
మలముల దానగరుఁ జేరి మాపటివేళన్. 293

క. కనకోపమాంగి చిలుకఁ
గనుగొని మనరాజమౌళి కథదెల్పితివెం
తని నిన్ను మెత్తునిక నా
పెనిమిటి జననంబు దెలియ ప్రియమగు ననుడున్. 294

## నలుబదియవకథ

గీ. చిలుక చిలుకల కొలికితోఁ జెప్పఁ దొడఁగె
అమ్మ! వినవమ్మ తారకాచలమునందు
నొక్కనాఁడు మహాదేవుఁ డుబుసుపోక
శ్రీకరోద్యానవనవాటిఁ జేరి యచట. 295

సీ. ప్రమథు లిర్వంకల బలసికొల్వఁగ రుద్ర
కన్యకామణులూడిగంబొనర్ప
భృంగి హాస్య క్రియారీతి నృత్యముసల్ప
చండీశ్వరుఁడు గుణస్తవమొనర్ప
విఘ్ననాథుఁడు పురోవీథి ముద్దులుచూప
శరసంభవుఁడు బరాబరియమర్ప
నందివాహనము చెన్నొంది మ్రోల నటింప
వీరభద్రుఁడు జయోద్వృత్తిఁ దెలుప
గీ. తండులాస్యంబునకుఁ దరుల్ తగఁ జిగుర్చు
నట్లు గాంధర్వ రసపూర్తి నలరుజాయ
నంబికాదేవితోడ నెయ్యమున నభవుఁ
డుచిత సింహాసనస్థుఁడై యుండునపుడు. 296

క. అమరేశ్వరాదిది గధిపు
లమరవరుల్ జపతపోమహర్షులు దమకుఁ
సముఖంబులేమి దృఢ భ
క్తి మరిన్ తమకడకుఁ జేరి ద్రిమ్మరువేళన్. 297

సీ. పసుపంటు జిలుగు దుప్పటి యాంచు ముత్యముల్
వరుసఁగన్పడు పల్లెవాటు దనర

చెంపనించుకజారు సిగనొప్పు సంపంగి
మడుపుటెత్తులతో రుమాలుమెరయ
ఘర్మాంబు బిందు సంగతి నొకింత రంగు
బొట్టు కస్తూరితావి బుగులు కొనఁగ
వెలిదమ్మితేఁకులు తెలిగఁకుల్కెడు దీర్ఘ
నేత్రాంతములఁ గొంత నిదురదొలుక
గీ. కరములను నిరు కలవొట్టు కప్పురంపు
విడెము పుక్కిట కడుచిక్కువడినహార
లతయుగంబునఁ బొసఁగ నుల్లాసమొసఁగ
వచ్చె నలకూబరుండు దుర్వారుఁ డగుచు. 298

చ. అపుడల పార్వతీరమణుఁ డన్నలకూబరుఁజూచి జాతికొం
చెపువగ నేఁగుదెంచె నని చాల మనంబుననెంచి యోరి! నీ
వపరిమితప్రమత్తుఁడ వహంకృతిచిత్తుఁడ విట్టులంతరం
గపు కొలునైనవేళ మముఁ గానఁగ నర్హుఁడవే గణింపఁగన్.

క. నీవధమవర్తకుఁడవు
గావునమానుముఖమ్ముగడియం దగునే
భూవలయమ్మునమర్త్యుఁడ
వైవర్తిలు మనుచు శంభు వానతి యొసఁగెన్. 300

క. మనమునఁ గడు బెగడొందుచు
విని ధనదసుతుండు సభయవిహ్వలమతియై
యనియెం బ్రణమిల్లి జగ
జ్జనకా! యీత ప్పొకింతసైపు మటంచున్. 301

లయగ్రాహి. శంకర నిశాచర భయంకర శివాహృదయ
పంకరుహభృంగ లకలంకరుచిమద్వి

## నలుబదియవకథ

గీ. చిలుక చిలుకల కొలికితోఁ జెప్పఁ దొడఁగె
అమ్మ! వినవమ్మ తారకాచలమునందు
నొక్కనాఁడు మహాదేవుఁ డుబుసుపోక
శ్రీకరోద్యానవనవాటిఁ జేరి యచట. 295

సీ. ప్రమథు లిర్వంకల బలపికొల్వఁగ రుద్ర
కన్యకామణులూడిగంబొనర్ప
భృంగి హాస్య క్రియారీతి నృత్యముసల్ప
చండీశ్వరుఁడు గుణస్తవమొనర్ప
విఘ్ననాథుఁడు పురోవీథి ముద్దులుచూప
శరసంభవుఁడు బరాబరియమర్ప
నందివాహనము చెన్నొంది మ్రోల నటింప
వీరభద్రుఁడు జయోద్వృత్తిఁ దెలుప
గీ. తండులాస్యంబునకుఁ దరుల్ తగఁ జిగుర్చు
నట్లు గాంధర్వ రసపూర్తి నలరుజాయ
నంబికాదేవితోడ నెయ్యమున నభవుఁ
డుచిత సింహాసనస్థుఁడై యుండునపుడు. 296

క. అమరేశ్వరాదిది గధిపు
లమరవరుల్ జపతపోమహర్షులు దమకుఁ
సముఖంబులేమి దృఢ భ
క్తి మరిన్ తమకడకుఁ జేరి దిమ్మకువేళన్. 297

సీ. పసుపంటు జిలుగు దుప్పటి యంచు ముత్యముల్
వరుసఁగన్పడు పల్లెవాటు దనర

వంటిమహామహు డుండఁగ
వింటి మనోభీష్ట మెల్ల వెలయఁగ గంటన్. 307

గీ. ఎంత సుజ్ఞాననిధివి నీ వెంత ఘనుఁడ
వెంత నిను మెత్తు నని పల్కు నంతలోన
చుఱుకు చుఱుకున నరుణావిస్ఫురణ మెఱయ
కరకరని తోఁచె తూర్పున ఖరకరుండు. 308

ఉ. అల్లప్రభావతీరమణి యంత నిశాంతముఁ జేరి నాఁటిరే
యల్లన కుందనంపు జిగియందపు మైఁగయిసేసి నేటికి
హల్లకభల్లతీవ్రనిశితాస్త్రహళాహళి కోర్వజాలరం
జిల్లఁగ రాజశేఖరుని జేరి సుఖించెద నంచు నెంచుచున్. 309

గీ. రామచిల్కకు మేలోగిరంబునాన
వాలుచక్కెరరసదాడిపాలచెఱుకు
లరఁటిపండ్లిడిపసపార్చి యక్కుచేర్చి
సెలవొసఁగుమన్న నామఁద్దుచిల్క యనియె. 310

## నలువదియొకటవకథ

క. రంభవు నీవు విలాస వి
జృంభణమున నిన్ను గనినచిత్తజుఁ డైనన్
శుంభద్రతి తంత్రకళా
రంభమునకుఁ దానె కదిసి ప్రార్థించుగదే! 311

సీ. ఇంద్రాదిదిక్పతులైన నీవడిపంచ
బడియందలములలోఁ బరివసింప
పోటుబంటులు నిజాద్భుతరణప్రాభవం
బులు గోరికొనుచు నీ కెలనుగొల్వ

సోమయాజులు బహుస్తుతులుచేయుచు ప్రేమ
బొదలని ముంగిట నొదిగియుండ
సన్యాసు లతనుజర్జరితసర్వాంగులై
యలర నీపాదంబు లాశ్రయింప
గీ. అందఱికి నన్నిరూపంబు లగుచుఁ జెలఁగి
భువనమోహనశృంగారభవనమైన
నీమహిమ నీ వెఱుంగక నేఁటి కిట్టు
లొక్కనృపమాత్రునకుఁ జిక్కియుండఁదగునె. 312

క. అని పల్క నద్భుతంబుగ
విని సురలోకముననుండి వెస నే నిచటఁ
జనియింప నేమిగారణ
మనుడు ప్రభావతికి యల శుకాగ్రణి యనియెన్. 313

క. నలకూబరుండు హాలా
హాలకంధరు నాజ్ఞ నిచటి కరిగెడునాఁడో
లలనా! నీవు పితామహు
కొలువునకుం జత యమర్చికొనియెద వచటన్. 314

గీ. అమ్మహాప్రభుఁ బొడగాంచి "యబ్జభవ! పు
రాణపురుష! సరస్వతీప్రాణనాథ!
సకలజంతువినిర్మాణ చతుర హృదయ!"
యనుచు కైవార మొనరించి యాక్షణంబ. 315

సీ. కాశ ధరించి రంగస్థలంబున నిల్చు
చెలువ మాయజుఁడైన తలపఁగలఁడె
సభ విస్మయమునొంద యభినయము ఘటించు
మెలకువ గురుఁడైన మెచ్చఁగలఁడె

కరలక్షణప్రయోగరమణచాతురి
యభినుతింపఁగ శేషుఁడైనఁగలఁడె
కలికికన్నుల కటాక్షంబు లంభోజాత
శరుఁడైన మరలింప చాయఁగలఁడె

గీ. ఔరయని చూచువారెల్ల యభినయింప
కలికివాల్ జూపులను శిరఃకంపనముల
యొరపు లెలనవ్వుముద్దుమై సిరిబెడంగు
మించ నటించుటయు న వ్విరించి గాంచి. 316

గీ. మెచ్చితి వరంబు వేఁడుమో మచ్చకంటి
యనుచు వచియించువేళ నీయనుగుచెలి యొ
కర్తె నలకూబరుఁడు ధాత్రి గదియువార్త
విన్నవించిన మదిలోనఁ జిన్నఁబోయి. 317

చ. కడుబెగడొంది సోగతెలిగన్నుల గుల్కెడు నీరు గ్రుక్కు
చున్, సిడిముడుపాటుతో నలకుశేశయగర్భపదాంబుజద్వ
యం, బిడి కడతేర నీవిరహభారభరం బిక మద్భుజంగునె
న్నడుగనుగొందు నొక్కొ కరుణామతి నానతియిమ్ము నావు
డున్. 318

ఉ. నీనయమార్గవైఖరికి నేమది మెచ్చితి నీలవేణిరో
నీనలకూబరుండు ధరణీస్థలికిన్ శివునాజ్ఞ నేఁగుటన్
పూని త్వదీయమోహపరిపూర్ణమతిన్ వెతనొందియున్నని
న్నానవమోహనాంగునెనయన్ సమకూర్చెదనమ్ము నెమ్మదిన్.

గీ. అల్లహరునాజ్ఞ దప్పింప నలవిగాదు
కాకయుండిన నేమి భూలోకముననె

నీకు నలకూబరునితోడ నిర్జరేంద్ర
పురి ననుభవించునట్లుగ నెఱతి నమర్తు. 320

ఉ. కావున నీమనంబునకుఁగాకవహించఁగనేల పొమ్ము ధా
త్రీవలయమ్మునం దవతరింపు మటంచు వచించునంత నాఁ
డీవరవైశ్యవంశమున నేపుదలిర్ప జనించినావురం
భా వనజాక్షి నీవ మితభాగ్యశుభోన్నతివో ప్రభావతీ. 321

క. అనిపల్కి జగచ్ఛ్రుతుం
డనుపీరన్నృసింహుఁ డుగ్రుఁడై తిమిరమహో
దనుజేంద్రు నేపడంచుట
గని కాంతనిజాంతిపురముగ దిసె నరేంద్రా! 322

గీ. అల ప్రభావతి యటునాఁ డహఃపయోధి
నానృపాలుని నవమోహనాంగరంగ
మైకవాంఛాపదమ్ము నొయ్యన తలంచి
మించి కురుమాపు నెఱపంజ మెఱయునంత. 323

చ. చిలకలకొల్కి మేన గయిసేసి నృపాలునిచెంతఁ జేరగాఁ
దలచి శుకాధినాథునరుతేఁ వెసనిల్చినమాత్ర శూన్యది
క్తలమున గౌళి నిల్వబలుకఁ విని సంశయమంది కుందుచో
చిలికెడు ప్రేమ నిట్టులను చిల్కసుధారసధారలొల్కగన్.

## —— నలువదిరెండవకథ ——

గీ. దుష్టశకునమ్ము విననయ్యె తోడ నేమి
యనుభవించంగవలయునో యని తలంచి
మిగుల దిగులొందనేటికో మీననయన!
యదియొ మంచిదటంచు నీమది గణింపు. 325

క. అది యెట్టు లనిన విను నె
మ్మది చెలంగ నీవిభుఁడు మమతం మఱిడె
బ్బదిసాళ్లనాటి కిలుజే
రుదు నని వాక్రుచ్చి చను టెఱుంగవె మగువా! 326

వ. కావున. 327

ఉ. నేఁ డతఁ డిల్లుజేరురమణీ! వెస డెబ్బదిసాళ్లుసల్లె నీ
పోఁడిమి నీ వెదుర్కొని విభుంగని మ్రొక్కి రహస్యలీల నీ
వేడుక లుప్పతిల్ల తనువిందొనరించి ప్రియంబునన్ రతి
క్రీడల దేలవమ్మ సుచరిత్రలు నిన్నునయంబు మెచ్చఁగన్.

వ. అని వచియించుచిలుకం గనుగొని ప్రభావతి యిట్లనియె.

గీ. కంటిపడవేసుకొంటి నోకథలకారి
ముద్దురాచిల్క నిన్నునమ్మి మోసబోతి
నింక నేమనగలదాన నేమిసేతు
ననుచు దీనానులాపంబులాడుచుండియును. 330

క. ప్రాణ మనిత్యము నిత్యము
మానంబని కావు ప్రాణమానంబులలో
మానమె కాయందగు నను
మానం బిక నేల నిలుపు మానం బనియెన్. 331

వ. ఆసమయంబున. 332

సీ. బహువిధసంభారభారముల్ తోనున్న
పెరికిపెద్దలుగుంపు లొనరిగొనగ
స్ఫుటసుగంధజలప్రపూర్ణములైనట్టి
కంచికావళ్లశృంగార మెసగ

భాస్కరపండితప్రముఖదేవబ్రాహ్మ
ణాళియాశీర్వాదనాద మెసఁగ
భవ్యసాధ్వీహస్త పాదార్పితంబులై
వితతవైఖరులనారతులు బొసఁగ

గీ. బహువిధంబుల రాజవైభవము మెఱయ
బంధు లిరువంక నొరయ సౌభాగ్యలీల
తననగరుఁజేరె శుభముహూర్తమున వేట్క
వెల్లివిరియంగ మలయజావల్లభుండు. 333

క. అంతట తత్కాంతామణి
శాంతన తనప్రాణవిభుఁ బొడగనియు మహీ
కాంతునిరతి సమకూడని
చింతఁ గాన వెసకానరాని శృంగారమునన్. 334

గీ. జారి మండికొనినచందాన తనమేని
చెలువ మప్పుడు పతికి సేఁవుచేసి
గంటుతోడమిత్రగణమెన్న సమధిక
శ్రీలకాపురంబు చెలఁగుచుండె. 335

వ. తదనంతరంబ. 336

చ. తనతలిదండ్రులం గని యథావిధి భోజన మాచరించి పెం
చిన శుకసార్వభౌముని భజించి ప్రియం బొనరించి సార్వభౌ
మున కతిలోకవస్తువులు ముంగలకానుకగా నొనర్చి పే
ర్చినముద మొప్ప నమ్మదన సేనుఁడు నెమ్మది నుండునంతటన్.

క. చిలుక దనుమోసబుచ్చుట
యలమికఁ దద్వైశ్యవరుఁ డిలు సేరుట్యుఁ గ

కలకంఠీమణిదూతియు చని
తెలుపఁగ విని యన్న రేంద్రతిలకం బలుకన్. 338

ఉ. హల్లకపాణిపొందు మది నర్థిలిగోరుట చందమామ గ్రు
క్కిళ్లయినట్టులయ్యె పవళింపగ నేఁడిక నేమిసేతు నీ
పల్లవికార్యసంఘటనభావ మెఱుంగక యింతసేసె నా
యుల్లము తల్లడిల్లెడు నయో యని మోహవిషాదవేదనన్.

క. ఈరీతి నుండ నేమో
కారణమున కీరమయ్యె గావలె దీనిఁ
జేరి యిది తెలియ దగునని
యారూఢి వివేకశాలియై విభుఁ డెలమిన్. 340

గీ. మదనసేనునియెఱుక నమ్మదను తేజి
నంతిపురిలోన నపరంజి యరిది పసుల
వింత నొక మేడనుండి యే కాంతవేళ
సమ్ముఖంబున రావించి సవినయముగ. 341

క. ఓ రాజకీర శేఖర !
నీరసికత మదిగణించ నేర్తునె యని నీ
వేఋషియంశంబున యవ
తారమునొందితివొ విబుధధర్మము వెలయన్. 342

చ. అనుటయు సంతసించి వసుధాధిపునిం గని చిల్కపల్కె నో
యనుపమశౌర్య! నేశుకమహార్షి వరేణ్యుఁడ నీప్రభావతీ
వనరుహగంధి ప్రాక్తనభవంబున మమ్ము భజించియుండె నా
నెనరున సంధిలఁగ గనుగొనఁగ జనుదెంచితి నీశుకాకృతిన్.

ఉ. వచ్చి ప్రభావతీవికచవారిజలోచన మమ్ము గొల్వ నే
నిచ్చరహించువేళ జగతీశకులార్ణవపూర్ణచంద్ర! నీ

వచ్చినప్రేమ నన్బిలువనంపుట కెద్ది గతంబు తెల్పవే
మచ్చికఁ నన్న యానృపకుమారకుఁడక్కనురాగవైఖరిన్. 344

వ. అప్పు డయ్యక్కప్రతిమప్రభావంబుగల లీలాశుకంబునకు సకల వివిధోపచారంబుల సమంచితోపమకుటసబహుమానంబుగా యతనిసాహాయ్యమని మనంబున భావించి ప్రదక్షిణ ప్రణామసంభావనపూర్వకంబుగా మృదుమధురగంభీరభాషణంబుల నిట్లనియె. 345

ఉ. కామకళాశుభాకరశుకప్రవరుఁ గనుగొంటి నేఁడు నా కాములు వీడుకొంటి నను ప్రాఙ్ముఖుఁజేయ దలంచి కొంటినా స్వామియు నీవె కా మఱికృతార్థుఁడ నీదుసుబుద్ధివింటె నిం కేమియొనర్తు దెల్పగదవే యన కీరవరేణ్యుఁ డిట్లనున్. 346

క. వామాక్షీ జనమోహన
కామాంధుం డైనయతనికథ వినుమును సు
త్రామముఖు లనుభవించిన
భాముల మది దెలియు మోనృపాలకతిలకా! 347

సీ. కాకుస్థకులుఁడవై కలనృపుల్ నినుగొల్వ
మఖుఁడేజగద్ధితమహిమనొందె
పడరాని యిడుములబడియు బొంకునెఱుంగ
కలహరిశ్చంద్రుండు నలసి యలసి
యల్లవిశ్వామిత్రు డతిబన్నములవెట్ట
రాజమార్తాండుడై గ్రాలెగాదె

సామ్రాజ్యవైభవ శాశ్వితుఁడయ్యెను
జనకుఁ డత్యంతసుజ్ఞానదీప్తి
గీ. యతులితోత్సాహవిదితమై యలరునట్టి
మహిమ వెలయు సద్భక్తసామంతశాలి
వగుచు వైరాజ్యవంతుఁడవై సమస్త
రాజ్యమేలగదయ్య యో రాజవర్య! 348

గద్యము. ఇది శ్రీముఖాదిరీ నృసింహకరుణాకటాక్షవీక్షణ సమాగతకవితాధారపాలవేకరికులకలశాంభోనిధి సుధాకర తాడిగోళ్ల కరియమాణిక్య నృపహార్యక్షపౌత్ర పవిత్రచరిత్రకదురధరామండలాఖండలపుత్ర విద్వత్కవి రక్షణానుసంధాయక కదిరీపతినాయక ప్రణీతంబయిన శుకసప్తతియను మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము సర్వము సంపూర్ణము.

వచ్చినప్రేమ నన్బిలువనంపుట కెద్ది గతంబు తెల్పవే
మచ్చిక నన్న యానృపకుమారకుఁ డత్యనురాగవైఖరిన్. 344

వ. అప్పు డయ్యప్రతిమప్రభావంబుగల లీలాశుకంబునకు సకల
వివిధోపచారంబుల సమంచితోపమకుటసబహుమానంబుగా
యతనిసాహాయ్యమని మనంబున భావించి ప్రదక్షిణ
ప్రణామసంభావనపూర్వకంబుగా మృదుమధురగంభీరభాష
ణంబుల నిట్లనియె. 345

ఉ. కామకళాశుభాకరశుకప్రవరుఁ గనుగొంటి నేఁడు నా
కాములు వీడుకొంటి ననుఁ బ్రాఙ్ముఖుఁ జేయ దలంచి కొంటి నా
స్వామియు నీవె కా మతికృతార్థుఁడ నీదుసుబుద్ధివింటె నిం
కేమియొనర్తు దెల్పగదవే యన కీరవరేణ్యుఁ డిట్లనున్. 346

క. వామాక్షీ జనమోహన
కామాంధుం డైనయతనికథ వినుమును సు
త్రామముఖు లనుభవించిన
కాముల మది దెలియు మోనృపాలకతిలకా! 347

సీ. కాకుస్థకులుఁడవై కలనృపుల్ నినుగొల్వ
ముఖుఁడేజగద్ధితమహిమనొందె
పడరాని యిడుములబడియు బొంకునెఱుంగ
కలహరిశ్చంద్రుండు నలసి యలసి
యల్లవిశ్వామిత్రు డతిబన్నములవెట్ట
రాజమార్తాండుడై గ్రాలెగాదె

దానినే ఉల్లెడయందురు. రాయలసీమలో ఈ యాచారము విశేష ముగా కలదు. ౨-౧౦

## ఎ

ఎక్కలిదేవి = ఒక గ్రామదేవత. ఈ దేవతను మాదిగవారు కొలుతురు. "ఎక్కలిదేవికి గ్రామకంకటున్" అని కవి ప్రయోగించుటచే ఈ రెండును క్షుద్రదేవతలని స్పష్టము. ౨-౪౪౫

ఎక్కలజోగు = ఎక్కలేజోగు అనియునందురు. ఎక్కలికి = దేవికి జోగు (భిక్ష) పెట్టుదుఅని యర్థము. మాదిగస్త్రీలు ఎక్కలజోగుఅని బిచ్చ మెత్తుట రాయలసీమలో సర్వసాధారణము. ౨-౪౭౫

## క

కారవంజి = ఎఱుకస్త్రీ. ౧-౧౦౧

కొల్లారుబండ్లు = నాలుగుదిక్కుల ప్రక్కమూతలుకల తడకలతో గూడిన బండ్లు, ఛానకబండ్లు. ౧-౨౨౨; ౧-౨౭౧

కట్టాణి = కంఠాభరణము. బంగారుగుండ్ల అయిదువరుసల కంఠహారమును ఇప్పుడును కట్టాణియందురు. ౧-౨౨౨

కంబమయ్య=గుత్తికి ఇంచుమించు ౨౦ మైళ్లదూరములోనున్న కంబగిరి అను స్థలము ప్రసిద్ధ తీర్థస్థలము. అచ్చటవెలసిన నరసింహాస్వామిని కంబ మయ్య అనియందురు. ౩-౪౯

మీదుకట్టుట="కాటిరేనికిమీదుగాగట్టినపరహాని"; ఆవులు, బఱ్ఱెలు పాలీయ కుండిన అవి యీనినప్పుడు మొదటి కొన్నిదినాలపాలు తాము నమ్మిన దేవరకు లేక మహాపురుషునికి ఇచ్చుకొందుమని ముడుపు కట్టు దురు. మ్రొక్కుబడి చెల్లువరకు పాలనుకాని మజ్జిగ వెన్నలుకాని ఎవరికిని ఈయరు. ౩-౫౦

## 8

కూనలమ్మచీర = కూసలు (పిల్లలు) లేనివారు కూనలమ్మ అను దేవతకు మ్రొక్కుకొందురు. ఆదేవతకు ఎఱ్ఱనిఅంచుగల తెల్లని చీరను నైవేద్యముతో నెక్కించి గొడ్రాలి కాచీరను కట్టింతురు. అందుచేత ఎఱ్ఱంచుగల తెల్లనిచీరను కూనలమ్మచీర యనిరి. ౨-౪౧౧

## గ

గౌర = కోమటి. కోమట్లలోనే గౌరయ్య, గౌరమ్మ పేరులెక్కువ. బెంగాలులోని గౌడదేశమునుండి క్రీ. శ. ౫,౬ శతాబ్దులనుండి విష్ణువర్ధనుని కాలమువఱకు తెనుఁగుదేశమునకు వలసవచ్చియుందురు. ౧-౧౨౭

గరస్తు = గృహస్థుయొక్క తద్భవము. ౨-౪౭౪

గాఱుగడపినట్లు=కష్టముతో జీవనము గడపుట అనిసందర్భమునుబట్టి గ్రహింపవలెను. ౩-౨౪౩

గురికాడు = వేఁటకాఁడు. ఇక్కడ యజమాని అనియర్థము. ౨-౪౯౧

గరాస = దుష్టుఁడా. ౨-౪౭౫

గుడిముద్ర = పూర్వము దేవుని పేర విడిచిన పశువులపై దేవాలయాధికారులు గుర్తుగా ముద్ర వేసెడివారు. ఆ ముద్రలుగల పశువులకు స్వేచ్ఛయుండెడిది. ౨-౫౦౭

## చ

చింతాకుముడుఁగుతఱి = మునిమాపుచీకటి వేళ. ౧-౫౩౩

చిటుకులాఁడి = పగలాఁడి. ౨-౨౯

చందనపుమానికెలు = రాయలసీమలో ఒకవిధమగు సాధారణ వృక్షమును చందనమందురు. అది చౌకకట్టె, ఆ కట్టెతో జెడిగములు; కొలతసేర్లు మున్నగునవి చేయుందురు. ౨-౪౦౬ చూడుఁడు. "ఇనుపకట్ల మానిమంతలు" అను ప్రయోగము. ౨-౩౬౦

చేపపీఁట = రాటమువడుకునప్పుడు కూర్చొను 'మూరెడెత్తుగలపీఁట. ఆ పీఁటకు

నాలుగు కాళ్లుండును కొన్నిటి కానుకోనుటకు వీపుపలకయుండును.
సాధారణముగా నాపీటకు నులకనల్లుదురు. ౨-౪౨౧

చిట్టెడు = నూనెకొలుచు మానము. చటాకులో సగభాగము. ౨-౩౮౧

చేమిడియిడుట = చేమిరియిడుట. పేరుటకై పాలలో చల్ల చుక్కవదలుట. ౨-౫౬౭

చెంగలమ్మ = పూర్వము నెల్లూరులో చెంగలమ్మ అను స్త్రీ సహగమనము చేసె ననియు, ఆమె దేవత యయ్యెననియు, ఆజిల్లాలో చెంగలయ్య, చెంగ లమ్మ పేరులు బహుళమనియు చెప్పుదురు. ౩-౪౦౩

## జ

జేమిడిక = ఆసాదులువాయించు మధ్యతంతిగల ఢక్క. ఈపదములో జేమలిక అనియుంకలదు. ముద్రితపదము వ్యవహారములోనుకలదు. అనియుం కొందఱందురు. అది సరికాదు. ౨-౪౧౫. ఆముక్తమాల్యద (౪-౧౭౭) లో "జమిడి" ప్రయోగముకలదు.

జగే = వెళ్లిపో. ౩-౧౯౬

## త

తిన్నెపెట్టు }
తీనెపెట్టు } = తిన్నె అనగా అరుగు. తిన్నెపెట్టుట అనగా దేవరనుకొలుచుట.

ఇంటిలో నొకగదిని దేవునిల్లుగా వాడుదురు. అందొకచోట చిన్న అరుగుకట్టుదురు. దానిపై మట్టిగురుగులను ఆయింట చనిపోయిన వారిలో ఇంటివారిని బాధించునని తలపబడిన ప్రేతల చిహ్నములుగా పెట్టుదురు. ఇంటివారికెవరికైన పెద్దజబ్బుచేసిన అంతకుముందా యింట చనిపోయినవారు భూతమైపట్టినదని సోది చెప్పించుకొని విశ్వసించి ఆ భూతమునకు మొక్కుకొని ఇంటనిలుపుకొని ఏటేట నైవేద్యమిత్తురు. అట్టిదానిని తీనెపెట్టుటయందురు. ౨-౪౪౬

తిరుమంజనము = తిరుమజ్జనము = దేవునికి స్నానముచేయించుట. 3-౧౩

తాళువారము = సోఫా. 3-౪౭౭

తమ్మికమ్మీఫిరంగి దొరతురంగి = చిలుక. ౨-౪౧౦

తోగబాబాపాదుశా కాయప్రంజిన్నెలు = చాదురకాపిరంగులు. ౪-౧౦౬

ద

దునేదాకటారి = దునేదారిఅనగా కూఁడు అని శబ్దరత్నాకరము. కాని రెండుప్రక్కలధార (పదును) కలకటారిఅని యర్థమేమో. ౨-౩౬౪

దర్శనపుపేరు = గవ్వలను వరుసగాకూర్చి బట్టపై అతికించి కుట్టినదానిని దర్శనపుపేరు అందురు. ౨ ౪౨౫

దట్టికట్టు = కుస్తీకై నడుముపట్టీని బిగించి సిద్ధపడుట. 3-౪౨౯

ధ

ధర్మధార = శత్రువు లోబడుమనియు, యుద్ధము చాలింపవలసినదనియు కోరినప్పుడు ఆ సూచనగా కొమ్మూదుదురు. ధర్మయుద్ధమందు కొమ్ము ధారపట్టి యుద్ధము నాపుదలచేయుటకు ధర్మధారయనిరి. ౨-303

ధణాయుండు = ఇది - దణాయుండు - అనుట సరియగునేమో. సేనాపతియని యర్థము.

ధావళి = తెల్లనియున్నితో నేసిన మడిపంచె. ధవళమైన ఉన్నిమడిపంచె. ఇట్టి ఉన్నిపంచెనుకట్టుట బ్రాహ్మణులలో కొందఱి ఆచారమైయున్నది. మహారాష్ట్రులలో ఈయాచార మెక్కువ. ౨-౪౪3

న

నభరువాఁడు=సైసువాఁడు. గుఱ్ఱమునుతోమి దానికి సేవచేయు ఘూలవాఁడు. ఇది ఉర్దూపదము. నేటికిని తెలంగాణమందు గ్రామాధికారులు సైసు వానిని నపన్ లేక నభరువాడు అనియందురు. ౨ ౪౨౭

నెటికవిరుచు = (ఇదే గ్రంథమందు మరొకచోట ౨-౫౦౫ లో మెటిక విరుచుఅని ముద్రింపనైనది. సరియగు పాఠము నెటికవిరుచుటయే) స్త్రీలు తిట్టినప్పుడుకాని దీవించినపుడుకాని వ్రేళ్లు పటపట మనమడుతురు. దానినే నెటికవిరుగుట యందురు. "నిజకులాచారవృత్తిపై నెటిక విఱువ" అని యిచ్చట యతిస్థానమందున్నది గమనింపవలెను.
౩-౧౫

పసులగోడలు = ఫార్సీలో ఫసీల్ అన కోటగోడ. ఫసీల్ పదమే "పసుల" అయినది. "పసులగోడలనైన వసుధ నిచ్చెనలేక యెక్కనేరనిదొట యెమ్మెలాడి" అను శుకసప్తతి ప్రయోగము గమనింపదగినది. పసుల- a wall at in which stek as fisad not పసుల అని బ్రౌను దొరగారు.
౧-౧౩౯

ఖాగడదండ = పూర్వము అపరాధులను ముఖ్యముగా అప్పులు చెల్లింపని వారిని, సర్కారు పన్నుల చెల్లింపనివారిని సెల్లాతోకాని త్రాటితో గాని మెడకుచుట్టి లాగుచుండిరి. అప్పు చెల్లించువఱకు కదలరాదని అప్పిచ్చినవాఁడు శాసించెడివాఁడు. "కవిరాజు కంఠంబు కౌఁగిలించెను గదా పురవీథి నెదురెండ ఖాగడదండ" అని శ్రీనాథుని చాటువు.
౨-౧౯

పజీతు = అవమానము. ఫజీత్ అను అరబీపదమునుండి వచ్చినది. "ఆటదాని బజీతు సేయగవలయుంనే" అని ఆముక్తమాల్యదా ప్రయోగము. (౫-౫౧) దానిపై వేదం వేంకటరాయశాస్త్రిగారిట్లు వ్యాఖ్యానించిరి "పజీతు = అల్లరి. బజీతు బజీతి—అని బ్రౌన్‌దొరగారు. భంజిత అను దాని వైకృతమని వైకృతదీపిక. అన్యదేశ్యమని బ్రౌన్‌దొరగారు" కళాప్రపూర్ణ లిట్లు వ్రాసినను ఫజీత్ అను అరబీనుండి యేర్పడినదని యనుకొందును.
౨-౧౭౭

పరుజు = పిడి.
౨-౨౪౧

పారిగోడ = ప్రహారిగోడ. శుకసప్తతి ననుకరించిన అయ్యలరాజు నారా

యణకవి తన హంసవింశతిలో పారిగోడ యనుచోట ప్రహారిగోడ అని వ్రాసెను. ౨-౧౪౯; ౨-౪౦౮

పాపోసులు = ముచ్చెలు. ఫార్సీలో పామొపోష్ - పాదములను మూయున నది. అది నర్థముకలిగి ముచ్చెలు అనుటకు రూఢియైనది. దానినుండియే పాపోసుశబ్దమేర్పడినది. ౨-౪౨౭

పటలాంశుకము = కప్పుకొనుదుప్పటి. శబ్దకల్పద్రుమములో పటలము = పరిచ్ఛదము అని వ్రాసినారు. తెనుగు నిఘంటువులలో ఇంటికప్పు మొదలైన అర్థాలిచ్చినారు కాని కప్పుకొనుదుప్పటి యని వ్రాయలేదు. 3-౭

పుడకలువిరిచిన = గట్టిగాచెప్పిన. ౧-౯౩౨

పడుదల = పక్షి విశేషమని శబ్దరత్నాకరము. "పడుదలలోన డాబాకత్తి" అనుచో అది సరిపోదు. పడుదల అనిన నడుము అని చెప్పవలెను. ౨-౪౨౬

పట్టెడు = పుటికెడు, గంపెడు. ౨-౪౯౦

పసులపొంగలి = సంక్రాంతిపండుగ. తమిళులలో పొంగలిపండుగ యని ప్రసిద్ధి. ౨-౯౬౩

పొప్పళి = చౌక. ఈ శబ్దమునుగూర్చి శ్రీరాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు నాకిట్లు వ్రాసిరి. "మాప్రక్క చౌకయిండ్లు అనునర్థమున వాడుదురు. పొప్పళిచీరలు నేటికిని ఈదేశం (మైసూరు) కోమటిస్త్రీలకు చాలా ప్రియము. ఈపదము కన్నడములోను కలదు. చౌక అని యర్థము." ౧-౨౩౭

పంటి = పనటి = వంటకుండ. ౨-౪౯౨

పొడుపువ్రేలు = చూపుడువ్రేలు. ౨-౪౪౩

పొన్నూళ్లు = పొయగూళ్లు అనుటకు కవి ప్రయోగము. 3-౪౩౮

బ

బురసానివల్వ = పట్టుపనికలవస్త్రము. యూరోపుఖండములో బ్రుస్సెల్సు

అనుఃగరమందు సిద్ధమై మనకు దిగుమతియైన కట్టును బ్రుసెల్సు పట్టి నిరి. అదే బురుసానిఅయ్యోనని ఒకవ్యాఖ్యాత వ్రాసినాడు. ౧-౧౬౪

**బండికండ్లు** = "బాసలట ! బండికండ్లట !" అని కవిబాసలను బండికండ్లను జంటగా వాడుటచే బాస—ప్రమాణము—శపథము అని బండికండ్లకర్థము చెప్పవలెను. ఆముక్తమాల్యదలో (౬-౫౧) "బాసలు బండికండ్లు మఱి ప్రాణభయంబున లక్షసేసినన్" అని కవి ప్రయోగించినాడు. దానిపై కళాప్రపూర్ణులిట్లు వ్యాఖ్యానించిరి. "బాసలు = ప్రతిజ్ఞలు, బండి కండ్లు = నిలుకడ లేనివి......ప్రతిజ్ఞలను నమ్మవచ్చునా? అసన్నుడు ప్రాణము తప్పించుకొనుటకై లక్ష ప్రమాణములు సేయును"—కాని ఇచ్చటకూడ "బాసలు బండికండ్లు" రెంటిని ఏకార్థముగా గ్రహించి—బాసలు ప్రాణాపాయ సమయములను లక్షసేయుందురు దానికేమి? అని యర్థముచెప్పుటయే సమంజసమని తలతును. శుక. ౨-౧౧౩

**బురుసీసు** = మేలైన మెత్తని ఉన్నితో నేసిన ఆచ్ఛాదనము (ఇంగ్లీషులో రగ్ అనునది) తెలంగాణా ఈపదము అందందు వాడుకలోనున్నది. ౨-౨౬౫

**బొబ్బిలికాయలు** = కాలి మూఁడవ వ్రేలికి ధరించెడు మట్టెలు. ౨-౨౩౨

**బందారాకు** = అది చెట్టుకాదు. అదొక నేలమీఁదనుండు తీగెఅలము. దానిని బందాలయని వ్యవహరింతురు. నేటికిని తెలంగాణమందు కొన్ని ప్రాంతాలలో గొల్లలు వర్షమువచ్చినప్పుడు బందారాకును అడుగున వేసుకొని పొలములో పండుకొందురు. ౨-౩౪౨

**బడాపగలజూచి** = "వచ్చిమదికి మెచ్చువచ్చు నెచ్చెలి, బడాపగలచూచి వింతపడమువాడి." ౧-౫౧౬. ఇచ్చట పగల యతిస్థానములోనున్నది. "అడుతోడబు, ట్టరెననువంటి సాధ్విని బడా పగలంగనుగొంద్రు" అని ౨-౩౬౯ లో 'డా' యతిస్థానములలోనున్నది. ఇదే శుకసప్తతిలో నాల్గవ యాశ్వాస తుదిభాగాలలో "బిగాబిగలజూచి" అని వ్రా

నారు. ఇందు బిగాబిగల అనగా బిఱ్ఱుగా, బిగ్గరగా, కనురెప్ప వేయక చూచి అను నర్థమిచ్చును. కాని "బడావగల" అనుపదమే—అందు 'డా', 'వ' అక్షరాలు యతిస్థానములో పడినందున సరియైనదన వలెను. సందర్భమునుబట్టి బిఱ్ఱుగా అదేపనిగా చూచుటఅని యర్థము చెప్పవలెను.

బొండకొయ్య = పూర్వము తప్పుచేసినవారిని, మరియు రాత్రులందు వీథులలో అనుమానప్రదముగా తిరుగువారిని తలారులు పట్టుకొనిపోయి చావడిలో కాలవేసి చేతులకు కాళ్లకు అవిపట్టునంతటి సంకెలుకం కట్టెపలకను (కోడెమును) తగిలించి దానికి కట్టెమేకును బిగించెడివారు. అదే బొండకొయ్య. ౩-౨౦౪

బిగువాళ్లు = బిగువైనవారులుకల చెప్పులు. ౩-౨౪౫

బంటుపైద = ఈ రెండుపదాలు జంటగా వాడబడినవి. పైదఅనగా బాలురు అని నిఘంటువులలో తప్పర్థము వ్రాసినారు. పైదఅనునది పార్సీ ప్యాదా (పాదచారి) అను శబ్దమునుండి వచ్చినది. ప్యాదాయనగా కాలరి (infantry) కాల్బలములోని భటుడు. ౨-౧౪౫

మ

మొఖామూలు = స్థానము. అనగా వ్యాపారస్థానములు. ఫార్సీలోని మొఖాల అనుపదమునుండి యేర్పడినది. ౧-౧౭౫

మడియడు = మూర్ఖుడు. ఇది తమిళములో ఎక్కువగానుండు పదము. ౧-౫౦౧

మారామఃళ్లు = చిక్కులు. ౨-౩౦

మట్టికిల్లాండ్లు = కాలి నాల్గవ వ్రేలికి పెట్టుకొనెడు మట్టెలు. పిల్లా:డియొక్క— బహువచనము. ౨-౩౩౨

మూల్లు = పెసరవంటి పప్పుధాన్యము. ౨-౪౦౬

మల్లసాలె = (ఇంగ్లీషులోని Drawing room) వంటిది తెలంగాణమందు భవంతికి మల్సాలెఅని కొన్నితావులలో ఇప్పటికిని వాడుచున్నారు. ౨-౪౦౮

మండాసు = టోపి (Skull Cap=పుర్రెటోపి) ఇది కన్నడపదము. నేటికిని తురకలు పుర్రెకు సరిపోవునట్టి బట్టటోపిని తగిలించుకొని దానిపై రుమాలును మెలికలు వడచుట్టుదురు. ౨-౪౨౭

ముస్తైదు = సిద్ధముగానున్న (Ready) ఇది ముస్తయాద్ అను అరబీపదము. ౨-౪౨౭

మణియము = నిఘంటులలో మణిగము, మణివము అను రూపాలిచ్చి అధికారము అనునర్థమిచ్చినారు. మణియరూపమియ్యలేదు. "గుడిమణియము సేయరాదు" అని సుమతిశతకము. గుడిపెద్దరికము అని మణిగపదార్థమునుబట్టి చెప్పవలెను. మన్నెము, మాన్యము, (సమ్మానించి ఇచ్చిన ఇనాములు) అనుపదములకిది సమానమైనదిగా కానవచ్చును. కావున గుడిసేవఅనియుం చెప్పవచ్చును. 3-3౭౨

ల

లపేటా = చుంగువిడిచికట్టిన నెత్తిరుమాలు. ౨-౪౨౭

వ

వట్రము = గుండ్రని చేతిసంచి; పైకముంచుకొనునట్టి చిన్నసంచి money purse. ౧-౫౧౦

వెలుంగు = ఇది వెలుగు అను రూపముగానుండవలెను. కంచెయని యర్థము. ౧-3౭౭

వింతటిపండుగ = జొన్నలురేగడి భూములలో హస్తచిత్తకార్తులలో విత్తుదురు. విత్తుటకుముందు గ్రామజను లొక శుభముహూర్తము నిర్ణయించి ఆనాడు గొఱ్ఱులకు రంగులుపూసి చీరలుకట్టి సొమ్ములుపెట్టి పూజించి

నై వేద్యమిచ్చి పండుగచేసుకొని సాయంకాలము మేళములతో నూరేగి ఎవరిపొలాలకు వారువెళ్లి మూడుమొలకలు మళ్లి విత్తనము వేయుచుందురు. అదేవింతటిపండుగ. ౨-౪౪-౨

వెట్టినీరు = కల్లు. ౩-౩-౨

## స

సింగడు = ఎఱుకువాడు. చెంచువారికి నరసింహ (సింగ) స్వామి ముఖ్యదేవత. అందుచేత ఆటవికులలో సింగడుఅను పేరెక్కువ. ౧-౯౯

సిరాజులు = "సిరాజి...చేకటులు" పర్షియాదేశమందు షీరాజ్ అను ప్రసిద్ధ నగరముకలదు. అందు సిద్ధమైన వస్తువులను సిరాజులనిరి. షీరాజ్‌లో మంచికత్తులు సిద్ధమగుటచేత సిరాజులన కత్తులనియు నర్థమయ్యెను. ౧-౨౨౨

సామ్రాణితేజులు = సామ్రాణిదేశపు గుర్రాలు. పర్షియాలో సమరాన్ అను మండలముకలదు. అచ్చటినుండివచ్చిన యుత్తమాశ్వములు సామ్రాణీలు. ౧-౨౨౩

సాత్కాలు = మ్రొక్కుబడులుఅని యర్థముండును. ౨-౪౧౬

సివసత్తులు = శివశక్తులు అనుదాని తద్భవము. అవసరమైనప్పుడు ఒళ్లునిండి ఊగుచు ఏదోదేవత ఆవేశమైనట్లును ఆదేవతను కొలువకుండిన గ్రామ జనులు నష్టపడుదురనియు చెప్పువారు. స్త్రీలే సివసత్తులుగా నేర్పడుదురు. ౩-౧౧౬

సబ్బజాలు = ఏమియు తెలియనివారు. ౪-౪-౨

## హ

హిజాపు = లాగు. పార్సీపదము. ౧-౨౪౯; ౨-౪౨౭

హారిచెయ్యాకలు = హారిచెఅననేమో? 'హారిత' అయియుండును. హారితయనగా గిజిగాడు అనుపక్షి. ౧-౨౪౬; ౧-౨౨౨

పొసిపోవగా = ఈపదమునుగూర్చి శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు నా కిట్లువ్రాసిరి. "అసత్యముకాగా; వ్యర్థముకాగా" అని యర్థము. కన్నడములో ఇదేయర్థముకలదు. పుసిఅని ప్రాచీనరూపము. తెనుగులో ముసిఅని మారినది." ౨-౪౦౬

ఈగ్రంథములో మరికొన్నిపదాలు నిఘంటులలోలేనివై అర్థముకానివై యున్నవి:—

వైకముద్ర

కంబరుచీని నిమతాని. ౨-౪౨౭

సీలు

అయగారికరలచీర

చిఱువాన

చిఱువాడు 3-౧౧౭

ఈ పదముల కర్థము తెలియరాలేదు.



# పూరణములు

4 వ పుటలోఁ జుక్కలున్నయెడ నీ పద్యమును జేర్చు కొనుఁడు—

క. ఉన్నతరి నన్నుఁ జూచి ప్ర
సన్నాననుఁడై సుధారససదృశమృదువా
క్యోన్నతి శుకసప్తతికృతి
చెన్నలర మదర్పణంబు సేయుకుమారా!

ఈ క్రిందిపద్యములను గ్రంథమున ముద్రితమైనరీతిని గాక ఇటచూపినవిధముగాఁ జదువుకొనవలయును.—

ప్రథమాశ్వాసము 26. నుండి 32. వఱకు,

సీ. సత్కళానిధియైన జైవాతృకుఁడు రాజ
చక్రపాలకమైత్రి సలుపఁ డనుచు
జీవనం బొసఁగి రక్షింపఁజాలు ఘనుండు
చంచలాత్మకత గద్దించు ననుచుఁ
దాభోగియై యనంతాభిధానుఁడు జగ
త్ప్రాణాపహారియై పరగు ననుచు
హంసాభిధైవతఖ్యాతజగన్మిత్రుఁ
డురుపుణ్యజనవృద్ధి కోర్వఁ డనుచు
తే. జలజరిపు మేఘ శేష సూర్యులహసించె
కాంచె సతచక్రభరణమార్గించె ధైర్య
మవనిఁబాలించె నిర్జించె నఘజవాలి
నారసద్గుణహారి శ్రీనారశౌరి.

చ. నల నిభుఁడైన యోబవిభు నారనృపాలుని యోలగంబునం
గలితసుగంధమాల్యవసనంబులతో సెలవైన వక్కలా
కులె యొకరాయమన్నెదొరకుం దగ పెండ్లికిఁ జాలునన్న చోఁ
దెలియఁగఁ దద్వదాన్యత నుతింప ఫణీంద్రునకైన శక్యమే. 27

సీ. తొలఁగినగతి సూడుదొరల ననాయాస
వర్ధితదుఃఖాశ్రువర్షములకుఁ
గొలిచిన సరిమన్నెగురిపేను లొనరించు
వరదానధారాప్రవాహములకు
నాశ్రయించిన భూసురాగ్రేసరులు సేయఁ
దొడరిన సవనాగ్ని ధూమములకు
నిడినసత్రముల నభీష్టమృష్టాన్నభో
జనజనజయజయశబ్దములకుఁ

తే. దడిసి వరదలఁ బడియుండి కుడిచి బెగ్గ
డిలఁగ నేమిటికిం దని తెలిసి దాఁటి
నేఁడు వార్ధులు గడవెళ్ల నీఁదె నౌర!
నారవిభుని యశఃకాంతనడత వింత

క. మేరుగిరిస్థైర్యనిధియౌ
నారనృపాలకుఁడు గనియె నయమార్గగుణో
దారులవరవీరయశో
హారులఁ దొమ్మండ్రు సుతుల నతులితమతులన్.

క. ఆరమణీయయశోవి
స్తారులలో వినుతిఁ గాంచె సకలధరిత్రీ
భూరితరభారవహనో
దారభుజప్రబలుఁ డోబధరణిపుఁ డవనిన్.

# పూరణములు

4 వ పుటలోఁ జుక్క లున్నయెడ నీ పద్యమును జేర్చు కొనుఁడు—

క. ఉన్నతరి నన్నుఁ జూచి ప్ర
సన్నాననుఁడై సుధారససదృశమృదువా
క్యోన్నతి శుకసప్తతికృతి
చెన్నలర మదర్పణంబు సేయుకుమారా!

ఈ క్రిందిపద్యములను గ్రంథమున ముద్రితమైనరీతిని గాక ఇటచూపినవిధముగాఁ జదువుకొనవలయును.—

ప్రథమాశ్వాసము 26. నుండి 32. వఱకు,

సీ. సత్కలానిధియైన జైవాతృకుఁడు రాజ
చక్రపాలకమైత్రి సలుపఁ డనుచు
జీవనం బొసఁగి రక్షింపఁజాలు ఘనుండు
చంచలాత్మకత గద్దించు ననుచుఁ
దాభోగియై యనంతాభిధానుఁడు జగ
త్ప్రాణాపహారియై పరగు ననుచు
హంసాభిదైవతఖ్యాతజగన్మిత్రుఁ
డురుపుణ్యజనవృద్ధి గోర్వఁ డనుచు
తే. జలజరిపుమేఘశేష సూర్యులహసించె
గాంచె నతచక్రభరణమార్జించె ధైర్య
మవనిఁబాలించె నిర్జించె నఁజవాళి
సారసద్గుణహారిశ్రీనారశౌరి.

# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 3 | 17 | తృణీకరించి | తృణీకరింతు |
| 4 | 15 | యుక్తి | యుంక్త |
| 6 | 9 | ంచినవిర నవధరించి | వించిననవధరించి |
| | 12 | వాప్తియగు | వాప్తియగును |
| 8 | 4 | గం | గ |
| | 5 | హార | హ్వార |
| | 21 | సప్తక | సప్తతి |
| | 24 | గారిచిహ | గారిచిహ్న |
| 14 | 19 | మునతు | మునను |
| 15 | 18 | నతును | నకను |
| 19 | 5 | సానాయ | సామ్నాయ |
| | 17 | భంగోద్ధ | భంగోత్థ |
| 22 | 5 | సమ్మదంబున్ | సమ్మదంబునన్ |
| 23 | 3 | ధవము | ధనము |
| 26 | 19 | స్వచ్ఛ | స్వచ్ఛ |
| 29 | 3 | బదనిక | బడనిక |
| | 4 | గారడ | గారుడ |
| 31 | 20 | రేఖవిభవము | రేఖావిభవము |
| 32 | 22 | బెగడ | దెగడ |
| 45 | 2 | రతిశు | రతిసు |
| 51 | 18 | దురిటిల్లు | దురపిల్లు |
| 52 | 2 | ఉ్యోమ్మంజా | ఉ్యోమ్మాచా |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 55 | 24 | పిల్లలు | పిల్లులు |
| 64 | 5 | సద్ధారా | సద్ధరా |
| 65 | 22 | గంద | గండ |
| 74 | 2 | మండలుఁ | మండనుఁ |
| 76 | 23 | శెఖరుఁ | శేఖరు |
| 98 | 11 | నొక్కకీ | నొక్కకే |
| 103 | 16 | శుధాంసు | సుధాంశు |
| 114 | 22 | చెఫు | చవు |
| 132 | 16 | బోడ్లకుం | బోండ్లకుం |
| 140 | 23 | గాక | గాన |
| 150 | 9 | పలిపల్కి | పలివల్కి |
| 153 | 15 | చెనా | చెరా |
| 176 | 10 | నెప్పును | నెప్పులును |
| 192 | 22 | సొగగు | సొబగు |
| 193 | 5 | మనుతురు | నుసుతురు |
| | 25 | కార్వ | కార్శ్య |
| 199 | 18 | ఈరీతి | ఈలీల |
| 213 | 15 | సభరు | నభరు |
| 222 | 17 | నోజనజాస్య | నోజలజాస్య |
| | 19 | సతుల | నతుల |
| 234 | 8 | గనియెను | గనియెనొ |
| 257 | 2 | కొనఁగ | కొనఁగ |
| 258 | 13 | వేసి | వేఁపి |
| 261 | 25 | పులుగాని | పులుకానీ |
| 263 | 6 | మంచు | నుంచు |
| 280 | 18 | రసనముస్త్రే | రసనముస్త్రే |
| 288 | 23 | నిందు | నందు |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| 309 | 7 | యవనీకాంతస | యవనికాంతరస. |
| | 18 | పరమే | పరమై |
| 312 | 4 | తనయాం | తనయ |
| | 8 | నడికొప్ప | నడికొప్పు |
| 314 | 14 | యొంచ | నెంచ |
| 323 | 6 | జిష్ణి | జిష్ణు |
| 335 | 15 | సాగిప | సాగిన |
| | 16 | గూలియించు | గూలియంచు. |
| 351 | 12 | యిట్లు | టిల్లు |
| 361 | 12 | గన్నెకలు | గన్యకలు |
| 370 | 14 | వాడఁబాటు | నొడఁబాటు |
| 377 | 2 | శాఁపు | సొంపు |
| 386 | 4 | మాధురీ | చాతురీ |
| | 6 | రాశికాం | రాళికాం |
| | 7 | మస్ఫురం | మద్భుతం |
| | 12 | కథిక | కథక |
| 390 | 19 | సభరూా | సభనా |



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1951

| పుటం. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 55 | 24 | పిల్లలు | పిల్లులు |
| 64 | 5 | సద్ధారా | సద్ధరా |
| 65 | 22 | గంద | గండ |
| 74 | 2 | మండలుఁ | మండనుఁ |
| 76 | 23 | శెఖరుఁ | శేఖరు |
| 98 | 11 | నొక్కుకీ | నొక్కుకే |
| 103 | 16 | శుధాంసు | సుధాంశు |
| 114 | 22 | చెవు | చవు |
| 132 | 16 | బోద్ధకుం | బోంద్ధకుం |
| 140 | 23 | గాక | గాన |
| 150 | 9 | పలిపల్ని | పలివల్ని |
| 153 | 15 | చెనా | చెరా |
| 176 | 10 | నెప్పును | నెప్పులును |
| 192 | 22 | సొగగు | సొబగు |
| 193 | 5 | మనుతురు | నునుతురు |
|  | 25 | కార్వ | కార్శ్య |
| 199 | 18 | ఈరీతి | ఈలీల |
| 213 | 15 | సభరు | నభరు |
| 222 | 17 | నోజనజాస్య | నోజలజాస్య |
|  | 19 | సతుల | నతుల |
| 234 | 8 | గనియెను | గనియెనొ |
| 257 | 2 | కొనఁగ | కొనఁగ |
| 258 | 13 | వేసి | వేఁచి |
| 261 | 25 | పులుగాని | పులుకాని |
| 263 | 6 | మంచు | నుంచు |
| 280 | 18 | రసనముస్నే | రసనముస్నే |
| 288 | 23 | నిందు | నందు |